ప్రకాశకులు :
అఖిలభారత సర్వసేవాసంఘం పక్షమున
సర్వోదయ సాహిత్య ప్రచారసమితి
సంచాలకుడు :
శ్రీ రామకృష్ణ ధూత్
గాంధీభవన్, :: హైదరాబాదు.

★

తొలి ముద్రణ
ఏప్రిల్, 1957
ప్రతులు : ఐదువేలు
వెల : 30 నయాపైసలు

★

ముద్రణ :
అజంతా ప్రింటర్సు
సికింద్రాబాదు

विप्लव पुरोगमनमु
दादा धर्माधिकारी का
'क्रांती का अगला कदम'
का
तेलुगु अनुवाद

अनुवादक :
कोमरगिरि नारायणराव

पहली बार : ५,०००
मूल्य : ३० नये पैसे
अप्रैल, १९५७.

प्रकाशक :
अ. भा. सर्वसेवासंघके लिये
सर्वोदय साहित्य प्रचार समिति के
संचालक,
श्री रामकृष्ण धूत
गांधी भवन, हैदराबाद.

मुद्रक :
अजन्ता प्रिण्टर्स, सिकन्द्राबाद.

# ప్రస్తావన

దాదాజీ వ్రాతలను గురించి ప్రత్యేకంగా ప్రస్తావించ నవసరమే లేదు. భూదాన యజ్ఞకల్పనా చిత్రంలో దాదా పూర్తిగా తాదాత్మ్యం పొందియున్నారు. మహాదానములు మహాకల్యాణదాయకములనియే గాక, నిత్యదాన విధానమే పాపవినాశనానికి ఆధారభూతం కావలెనని ఆయన ప్రతిపాదన. ఒరిపిడిరాయిపై పరీక్షించిన పిదపనే ఆయన తన భావాలను ప్రకటిస్తారు. అందువల్ల ఆయన ఉపన్యాసాలు శ్రోతల మనస్సులను వశపరుచుకోవడానికి బదులు ఆనందపరవశులను జేస్తూవుంటవి.

ఇప్పుడు ప్రజల హృదయాల్లో భూదానయజ్ఞ మహోద్యమం వ్రేళ్లునాటుకు పోయినది. బీహార్ రాష్ట్రంలో మాత్రం ఈ పరిస్థితి తప్పనిసరిగా ఉన్నదని చెప్పవచ్చును. ఎవరైనాసరే, ప్రజలవద్దకు పోయి కొంత భూమిని దానంగా సంపాదించగలడు. ఇలా భూమిని ఎవరి నుండైనా సంపాదించినంత మాత్రాన "భూమిదాన" యజ్ఞోద్యమం పూర్తి కాజాలదు.

ఈ ఉద్యమతత్వాన్ని పూర్తిగా తెలుసుకోగలిగిన వారే ప్రజలలోకి పోగలుగుతున్నారు.

యుక్తి ప్రయుక్తులతోనూ, భావనాపటిమయొక్క ఓతప్రోతములతోనూ నిండియున్న "దాదాజీ" ఈ రచన కార్యకర్తల నిర్మాణంలో ఉపయోగపడగలదని ఆశిస్తున్నాను.

భూదాన యజ్ఞానికి నేను "ధర్మచక్రప్రవర్తన" మని పేరు పెట్టాను. పరిశుద్ధమైన భావాలయొక్క నిర్ణీతపథంలోనే "ధర్మచక్ర ప్రవర్తనం" సాధ్యం కాగలదు. పవిత్రమైన భావాలు కొలచి, తూచి ఉపయోగింపబడే శబ్దాలలో మాత్రమే సువ్యక్తం కాగలవు. ఈ విధమైన శబ్ద నిర్మాణం, ఋజువర్తన గలవారికి సహజంగానే సాధ్య

మౌతుంది. "దాదా" ఈ శ్రేణికి చెందినవాడగుటచే వరి కూర్చి పొందగ బడిన వారి భావాలను ప్రజలు బాగా అర్థం చేసుకుంటారు. అందుకు తగిన భాషకూడా ఆయనకు స్ఫురిస్తుంది. "దాదా" యొక్క ఈ శబ్ద ప్రయోగసిద్ధి కేవలం ఆయన విద్యాప్రావీణ్యతపై ఆధారపడి లభించి నదికాదు. సంపూర్ణంగా వికసించియున్న ఆయనఋజుబుద్ధియే ఇందుకు కారణం. పాఠకులు ఈ "రచన"ను ఋజువైనబుద్ధితోనే చదివి, ఇందులోని అంశాలపై సమగ్రంగా ఆలోచించవలెననియు, అలా చేసి నప్పుడే తాము అపేక్షించిన ప్రయోజనం వారికి సిద్ధించగలదనియు భావిస్తున్నాను.

బిహార్
15 ఆగస్టు 1953

—వినోబా

## రచయిత చెప్పిన రెండు మాటలు

భూదాన యజ్ఞోద్యమం క్రాంతికారియైన ఒక మహాఉద్యమం. అది పీడిత, దళితవర్గాల యొక్క ఉత్సాహాన్ని, పిరక్షాన్ని అభివృద్ధి పరుస్తుంది. విప్లవానికి అది విరోధికాదు. అందులోని రక్తపాతమూ, క్రూరత్వమూ, హృదయ కాఠిన్యమునకు మాత్రమే విరోధి. భావనలో ఎంత పవిత్రత— ఉదాత్తత ఉంటే క్రాంతి సైనికుని శక్తి అంత అమోఘంగా పనిచేస్తుంది.

—దాదా ధర్మాధికారి

# విప్లవ పురోగమనము

---

## :1: క్రాంతిపథంలో ముందడుగు

భూదాన యజ్ఞ మహోద్యమానికి అర్థం ఒక్క మాటలో చెప్పాలంటే "పేదవాని యాజమాన్యం" అని చెప్పవలసివస్తుంది. నిజంగా ఈనాడు అతని రాజ్యం ఏర్పడేయున్నది. ఇంతేకాదు ఈ దేశ పరిపాలన అతనికి అప్పగించి భూమి, సంపద మొదలగు వాని యన్నిటిపైనా అతని యాజమాన్యం స్థాపించబడాలి.

"పేదవాని రాజ్యం" అంటే ఏమిటో మనం సరిగ్గా తెలుసుకోవాలి. మనకు స్వరాజ్యం వచ్చిన తొలిరోజుల్లో, ప్రజా పరిషత్తు సమావేశం జరుగుతూ వున్నప్పుడు– కొందరు మిత్రులు చాలా కోపంతో నాకు ఉత్తరాలు వ్రాసేవారు–"మీరు ఏమి చేసినాసరే ఢిల్లీని స్వతంత్ర భారతావనికి రాజధానిగా మాత్రం చేయవద్దు" అని. ఎందుకయ్యా అని, వారిని అడిగితే "ఢిల్లీని నేటివరకు పరిపాలించిన ఏ రాజుల, చక్రవర్తుల రాజ్యంకూడ స్థిరంగా నిలిచి ఉండలేదు. మీ రాజ్యంకూడా చిరకాలం మన జాలదు. ఇది ఒక అభాగ్యనగరం" అని జవాబు చెప్పారు.

ఇది ఢిల్లీనగరంయొక్క దోషంకాదు. ఏ రాజూ, చక్ర వర్తియొక్క ఆధిపత్యాన్ని చిరకాలం సహించి యుండక

పోవడం ఢిల్లీయొక్క సుగుణమే. అది మిక్కిలి భాగ్యవతి; సుల క్షణశాలి. కనుకనే రాజులకు, సామ్రాట్టులకు చిరకాలం రాజ ధానిగా ఉండడానికి ఇష్టపడలేదు. ఈనాడు ఢిల్లీ భారత దేశ ప్రజారాజ్యంయొక్క ప్రజాప్రతినిధి సభకు రాజధాని. ఎందరో రాజులూ, రాజవంశాలు పుట్టుతూ గిట్టుతూ వుంటారు. ఎన్నో రాజ్యాలు, వంశాలూ నిర్మింపబడుతూ, నిర్మూలింపబడుతూ వుంటాయి. కాని దేశప్రజలుమాత్రం గంగాప్రవాహంవలె-సూర్య చంద్రాదులవలె శాశ్వతంగా నిలిచివుంటారు. రాజధానియైన ఢిల్లీ ఈ దేశానికి పుణ్యక్షేత్రం మాత్రంకాదు. "లోకధాని" యగు ఢిల్లీయే స్వతంత్ర భారతావనికి అమరావతి. ఈ పవిత్ర నగరంలో ప్రజల సింహాసనానికి ప్రాణప్రతిష్ఠ చేయబడింది. జాతి పితయగు మహాత్ముడు తన రక్త ప్రదానంతో దాన్ని పునీతం చేశాడు.

## లోకరాజ్య లక్షణాలు :

భారత దేశములో ప్రజారాజ్య స్థాపనకు మొదటిగుర్తు ఆసేతు హిమాచల పర్యంతం ఎక్కడా రాజుల పరిపాలన లేక పోవడమే. అయిదారు సంవత్సరాలకు పూర్వం ఈ శుభపరి ణామం ఇంత త్వరలో రాగలదని మన మెవరమూ ఊహించ నైనాలేదు. ఈనాడు ఢిల్లీపై ఏవ్యక్తి అధికారమూలేదు. దాని సింహాసనంపై ఎవరూ తన ఇష్టప్రకారం కూర్చొనుటకు వీల్లేదు. కత్తితో ఎవరూ దాన్ని స్వాధీనం చేసుకోజాలరు. ఎవరూ దాన్ని కొనలేరుకూడా. రాజేంద్ర బాబూ మరియు పం. జవా

హార్లాలు నెహ్రూ ఢిల్లీ సింహాసనంపై కూర్చుంటున్నా, వారి యిష్టప్రకారం మాత్రంకాదు. ఈ దేశంయొక్క నిరుపేదల అనుమతి పొందియే వారు ఆ స్థానాలను అలంకరించి యున్నారు. వారి అనంతరం ఆ కుర్చీలపై వారి కుమారులు, మనుమళ్లూ కూర్చోబోవడంలేదు. ఈ దేశంయొక్క పౌరుల అనుమతి మళ్లీ పొందనిదే వారు స్వయంగానైనా ఆ కుర్చీలపై కూర్చోజాలరు. ప్రజారాజ్యంయొక్క ప్రథమ లక్షణం ఇది.

ఢిల్లీ సింహాసనంపై రాష్ట్రపతికెంత అధికారంకలదో రాష్ట్రపతి భవనంలో సఫాయీ పనిచేసే పాకీవానికికూడా అంతా ఉన్నది. ప్రధానమంత్రి కాదగువానికెంత అధికారం ఉన్నదో ఆయన ఆఫీసులో ఊడ్చేవానికి సహితం అంతా అధికారం ఉన్నది. బిర్లా, టాటా, డాల్మియావంటి కుబేరులకు, ఢిల్లీ సింహాసనంపై ఎంత పెత్తనం కలదో బాజార్లలోనూ, రైల్వే స్టేషన్లలోనూ కూలీపని చేసేవారికికూడా అంత పెత్తనం కలదు. ఇది ప్రజారాజ్యంయొక్క రెండవ లక్షణం.

నేటి పేదవాడు తన దేశానికి రాజై పోయినాడు. అంటే మనం ఒకడుగు ముందుకు వేశాం అన్నమాట, దాన్ని ఇక వాపసు తీసుకోజాలము. రెండో అడుగు వేయాలసి ఉన్నది. రాజైయున్న పేదవాడే, యజమానికూడా అయి తీరుతాడు, నేడోరేపో!

పేదవాణ్ని యజమానిగా చేయాలంటే అతనికి లభించిన పరిపాలన అతనినుండి తిరిగి తీసుకోవాలని కొంద రంటారు. ప్రజాతంత్ర వ్యవస్థలోగల "ప్రజాస్వామ్యవాదం" ద్వారా "ఆర్థిక

విప్లవం" రాజాలదు. పేదవాణ్ని సుఖపెట్టాలంటే అతనికి ఉన్న స్వాతంత్ర్యాన్ని లాగివేయాలని వీరి అభిప్రాయం. వారిచ్చిన ఈ సలహా మనను ముందుకు తీసుకో పోజాలదు. వెనక్కే తీసుకో పోతుంది. "ప్రజాస్వామ్యం" రాజనీతి శాస్త్రంలో ఒక నూతనా విష్కారం. పరిపాలనా విధానాల్లో ప్రజాస్వామ్య విధానంకన్న ఉత్తమమైన మరొక మార్గాన్ని మనుష్యుడు ఇంకా కనిపెట్ట లేదు. ప్రజాస్వామ్యం స్థిరంగా ఉండాలి. ఆ మార్గములోనే "లోకస్వామిత్వం" "ప్రజాస్వామ్యం" స్థాపింపబడవలెనని మా అభిప్రాయం.

## శ్రీమంతుని కుక్కగూడా నిర్విచారంగా జీవిస్తుంది :

ఒక నడివయస్సుగల మనిషి రైలులో రెండో తరగతిలో స్థలం దొరకనందున, మొదటి తరగతి డబ్బాలో కూర్చున్నాడు. ఆ డబ్బాలోనే చదువుకున్న ఒక యువతికూడ ప్రయాణంచేస్తూ వుండెను. ఆమె వేషభాషలు పూర్తిగా నవీనములుగా నుండెను. ప్రస్తుతం మనం ఆ పిల్ల ఎలావున్నదీ అనే విషయమై ఆలోచించ నవసరంలేదు. పట్టణాల్లో ఉండే ప్రతియింట్లోనూ, మన ఇళ్ల ల్లోనూ ఇలాంటి పిల్లలే ఉంటారు. ఆ పిల్ల ఒడిలో ఆమె పెంపుడు కుక్క కూర్చొని యుండెను. ఆమె తడవతడవకూ తన కుక్కకు రొట్టెముక్కలను, బిస్కత్తులను తినుపిస్తూ వుండేది. ఇదంతా ఆ నడివయస్సుగల మనిషి ఎంతో వేడుకతోచూస్తూ వుండేవాడు. మానవుని మస్తిష్కం ఖాళీగా వున్నప్పుడు దానిలో సైతాను ప్రవేశిస్తుందికదా? దేవుడు మరచిపోయిగూడా అచటికి రాడు.

మన పరిస్థితి ఈ విధంగానే యున్నది. ఆ ప్రయాణీకుని అవస్థ మాత్రం ఇలానే వున్నదని చెప్పవలసి వస్తుంది. అతడు "తాను ఆ పిల్ల కుక్కైనా ఐ ఉండినట్లైతే ఏలావుండేదో ?" అని ఆలోచింపసాగాడు. మీ మేధస్సులు ఉన్నతమైనవి. అందుకే మీరు గొప్పగొప్ప ఆలోచనలు చేస్తూవుంటారు! ఎవరైనా "నేను స్టాలిన్ అయితే పంచేస్తానో" అని ఆలోచిస్తే ఎలావుంటుంది ? "నేను జవాహర్లాలునైతే ఇలా చేసేవాణ్ని—అలాచేసేవాణ్ని" అని ఎవరైనా అంటే మీరేమంటారు ? తోటమాలినై యుంటే "నేను, పూలవనాన్ని దోచుకోమనేవాణ్ని." మీవి గొప్ప మేధస్సులు కాబట్టి ఇలాంటి పెద్దపెద్ద ఆలోచనలు చేస్తూవుంటారు. పాపమా పెద్దమనిషి, పిల్ల ఒడిలోని కుక్కనైనా కనీసం కాకపోతినిగదా ? అని విచార పడసాగాడు.

ఇందులో మూడులాభాలు మాత్రం స్పష్టంగా కనిపిస్తున్నవి. పిల్లవాళ్లు పెద్దవాళ్లైన తరువాత దాగల ఈ వయస్సులో ఎవరిఇల్లు వారు ఏర్పరుచు కుంటారుగదా? ఇక, ఈ సమయంలో ఇలాంటి ఒక పడుచుపిల్ల ఒడిలో ఆయనకు విశ్రాంతి లభించినట్లైతే దేవునికి ఆయన ఎన్నో ధన్యవాదాలర్పించి యుండేవాడు. కాని దేవుడు అలాచేయక పోవడంలో ఆయనకొక వరప్రదాన మిచ్చినట్లైంది— ఇది మరొక లాభం.

ఇంతేకాదు. మరోలాభంకూడావుంది- ప్రతి నిముషానికీ ఒక పక్వాన్నం తినడానికి లభిస్తూవుండేది! ఆకలైనప్పటికీ "కుక్క" వలె వీధివెంట బొమికలకై తిరగవలసివచ్చే అవసరం పట్టేదికాదు గదా? ఇది మూడోలాభం. ఈ మూడులాభాలు విలువలోగాని,

తూకంలోగాని ఏమాత్రం తక్కువైనవిగావు. అందుకై ఆయన కుక్క అవతార మెత్తడానికైనా చపలసిద్ధుడైనాడంటే ఆశ్చర్య పడవలసిన అవసరంలేదు.

ఇంతలో అతని హృదయాంతరాళంలో దాగియున్న అసలు మానవుడు గభీర కంఠంతో ప్రశ్నించాడు అతణ్ని. ఒక వేళ దేవుడు నీకు ప్రత్యక్షమై నీముందు నిలిచియుంటే "నన్ను ఆ పిల్ల ఒడిలోని కుక్కగా జేయ"మని ప్రార్థింతువా? ఈ ప్రశ్నకు అతని "అంతర్వాణి" ఇలా బదులు చెప్పింది. "ఆ పిల్ల ఒడిలోని కుక్కై సుఖంగా తినుబండారాలు తినడానికన్న స్వతంత్రుడనై పేదవానిగా బ్రతుకుటయే మేలు."

## పేదవాడూ, అతని స్వాతంత్ర్య సౌఖ్యాలు :

స్వేచ్ఛా స్వతంత్రాలకన్న సుఖానికే ప్రాధాన్యత నిచ్చే వారు వాస్తవంగా సుఖాన్నీ అనుభవించలేరు—స్వతంత్రంగానూ ఉండలేరు. స్వాతంత్ర్య భవనంయొక్క దరిదాపులకుగూడా వారు చేరుకోలేరు. పేదవాని సుఖంకొరకు అతనికిగల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను వమ్ముచేయకూడదు. కొంతమంది అధికారం గల పరిపాలకుల చేతుల్లో అతని జీవితాన్ని—గౌరవాన్ని బలి యివ్వరాదు. పేదవాళ్లను అధికారులపై ఆధారపడిన కొంత మంది గుత్తేదారుల చేతుల్లో కీలుబొమ్మలుగాచేసి సుఖపెట్ట దలచుకోరాదు. పేదవాని యాజమాన్యం పేదవారు స్థాపించు కున్న రాజ్యంద్వారానే స్థాపించబడాలని నా అభిప్రాయం.

ఒక పిడికెడు మనుష్యులు తమ చేతుల్లో అధికారాలన్నీ పెట్టుకొని పేదవాని సుఖాన్ని గుత్తా తీసుకోవడానికి సిద్ధంగా ఉన్నప్పుడు అంగీకరించడంలో ఏమినష్టం ఉన్నదని కొందరు ప్రశ్నిస్తారు. ధనం కూడబెట్టడంపై ఆశగలవానికి అధికారంపై కూడా వ్యామోహం ఉండితీరుతుందనే నిజాన్ని ఈ పృచ్ఛకులు మరచి పోతున్నారు. దీనిలో ఒక్కొకప్పుడు ధనము, సంపత్తి కలవారు ఉన్మత్తులౌతూ వుంటారు. ఇదే విధంగా అబాధితమైన నిరంకుశాధికారం గలవారుకూడా ఉన్మత్తులౌతూ వుంటారు. పట్టణాల్లోవుండే ధనవంతులు, షాహుకార్లు, జమీందారులూ, పెట్టుబడిదారులు ఏ ప్రకారం అహంకారంలో మునిగి ఉంటారో ఆ ప్రకారమే ఒక సాధారణ పోలీసు సిపాయీ, గుమాస్తాకూడా తన బెట్టుసరి చూపకుండా ఉండలేడు. ధనమదాంధతవల్ల ఒక మనిషియొక్క అహంకారం ఆకాశాన్నంటిపోతే — అధికార తృష్ణకూడా అతన్ని పరవశుణ్ని చేసివేస్తుంది. అందుకే మనం ప్రజారాజ్యంద్వారా పురోగమించాలని అభిప్రాయ పడుతూ వున్నాం.

## పిల్లికూన - పండితుడు :

పేదల రాజ్యంయొక్క లక్షణాలు ఇప్పుడు మనకు కొంత అర్థమైనవి. ఇక పేదల యాజమాన్యం అంటే ఏమిటో దాని పరిణామాలేమిటో తెలుసుకుందాం.

బంకింబాబు వ్రాసిన "కమలాకాంతేర్ దఫ్తర్" అనే ఒక చక్కని పుస్తకం వున్నది. ఆ పుస్తకంలో ఒక కథ ఉన్నది."

ఒక గ్రామంలో ఒక గొల్లదాని ఇంటిప్రక్కనే ఒక బ్రాహ్మణు డుండేవాడు. ఆయన మిక్కిలి భోజన ప్రియుడు. భోజనానికని పిలిస్తే తప్పకుండా అంగీకరించడం ఆయనకు పరిపాటి. ఎప్పుడూ ఏదో విధంగా ఆమె ఆ బ్రాహ్మణ్ని భోజనానికి పిలుస్తూవుండేది. ఒకరోజు ఆ గొల్లభామ ఇంట్లో శ్రాద్ధం వచ్చింది. ఆనాడు ఆ బ్రాహ్మణ్ని ఆమె తప్పనిసరిగా భోజనానికి పిలిచింది—భోజనా నంతరం "దక్షిణ" కూడా దొరికే అవకాశం ఉండేను. అందుకై ఆ బ్రాహ్మణుడు చాలా విశ్వాసంతో శ్రద్ధతో భోజనంచేశాడు. ఏమీ బాకీ ఉంచకుండా కడుపునిండా భోజనం చేయడం జరిగింది- దక్షిణ తీసుకొని, తాంబూలం నములుతూ వెళ్ళిపోతూ వుండే సమయంలో ఆ గొల్లభామ బ్రాహ్మణునితో "అయ్యా! మీ పేరట దాచి ఉంచబడిన ఒక మిఠాయి ఉండ మా ఇంట్లో ఉండి పోయింది. దీన్నికూడా తీసుకోపోండి లేకపోతే నాకు పాపం వస్తుంది" అని అన్నది. శాస్త్రులవారు మిఠాయిఉండ తీసుకొని ఇంటికివెళ్ళి జాగ్రత్తగా దాన్ని ఉట్టిపై దాచిపెట్టాడు. తిన్న అన్నంకాస్తా అరగడానికి ఇంత వాముసహితం నమిలాడు. ఆపైన కొంచం నిషావచ్చింది—"ఇక మిఠాయివుండ గతి రేపు ఏంకావలె"నని ఆలోచింపసాగాడు. ప్రభుత్వంవారి పంచవర్ష ప్రణాళికలవలెనే బ్రాహ్మణుడుకూడా ఒకరోజు రెండురోజుల ప్రణాళికలను వేయసాగాడు. రేపు ఎక్కడైన కోవా తయారు చేయించాలా, లడ్డూలు తయారు చేయించాలా! అని అంచ నాలు వేయడం మొదలు పెట్టాడు. ఇంతలో ఒకపిల్లి రానే వచ్చింది—ఆ మిఠాయి ఉండ ఉన్న ఉట్టిపైకి దుమికింది. శాస్త్రిల

వారు ఆ పిల్లిని ఉద్దేశిస్తూ "నీవు చాలా దొంగవు—దోపిడిచేస్తావు. పట్టపగలు నాముందే నీవు మిఠాయివుండను ఎత్తుకోపోవడానికి వచ్చావు" అని అన్నాడు. ఆ నిషాయొక్క తన్మయత్వంలో పిల్లికూడా ఇలా జవాబు చెప్పినట్లైంది. "అయ్యా! మీరు తల్ల క్రిందులుగా మాట్లాడుతూ వున్నారు. మీ పొట్టలో కుతికెనిండా అన్నం ఉన్నది—నువ్వుగింజకూడా పట్టే సందులేదు. నిజానికి ఈ మిఠాయివుండపై మీదే హక్కు. కాని నేనో మూడురోజులనుండి ఉపవాసం చేస్తున్నాను. ఈ మిఠాయివుండపై నాకేమాత్రం హక్కులేదని చెప్పడం ఏమిన్యాయం? ఇది సరియైన నీతికాదు. తల్లక్రిందులు నీతి." శాస్త్రులవారు పిల్లితో "నీవు నాకు న్యాయ పాఠం చెబుతున్నావా? నీవు నాస్తికురాలివి. నీవు కమ్యూనిష్టువై పోయినావు. ధర్మవిరుద్ధంగా మాట్లాడుతూ వున్నావు. నీతికి, నాయ శాస్త్రనికి విరుద్ధంగా నీవు మాట్లాడుతున్నావు" అని దీర్ఘోపన్యాసంచేశాడు. పిల్లి కొంచం ధైర్యం తెచ్చుకొని, "ఓ బ్రాహ్మణదేవా! ఏ ధర్మం, ఏ నీతి, ఏ న్యాయశాస్త్రం, అన్న పానాదులపైన ఆకలిగొన్నవారి హక్కులను అంగీకరించడానికి బదులు, పూర్తిగా కడుపునిండి యున్నవారి హక్కులను అంగీకరిస్తుందో, ఆ ధర్మం "ధర్మం" కాజాలదు. ఆ "నీతి" నీతికాదు. ఆ "న్యాయం" న్యాయంకాదు" అని ప్రత్యుత్తర మిచ్చింది. శాస్త్రుల వారు గగ్గోలు పెడుతూ "నీవు ఇక తిన్నగా వినేటట్టులేదు - నీపైన కోర్టులో దావావేస్తాను. రాజ్యాంగ విధానంలో నాకు కొన్ని ప్రాథమిక హక్కులు, రక్షణలు కల్పించబడియున్నవి. ఆ సూత్రాల ప్రకారం ఉన్నత న్యాయస్థానానికి వెళ్లుతాను"

అని జవాబుచెప్పాడు. పిల్లి ఎంతో గంభీరంతో "మీరు న్యాయ స్థానానికి పోవడం నాకు అంగీకారమే. మీరు తప్పకుండా నాపై దావావేయండి. కాని, అందుకు రెండు షర్తులు:— (1) దావా వేయడానికి పూర్వం మీరు వారం రోజులు ఉపవాసం చేయండి. ఈ ఏడు రోజులూ ఇరుగు పొరుగు గొల్లవారి ఇండ్లలో పాలు దొంగతనంగా మీరు త్రాగక పోయినట్లైతే మీ దావాను నేను అంగీకరిస్తాను. రెండోషర్తు:— ఏ న్యాయమూర్తి న్యాయస్థానంలో దావానడుస్తుందో ఆ న్యాయమూర్తికూడా వారం రోజులు ఉపవాసం చేయాలి. ఈ ఏడురోజుల్లో ఆ న్యాయమూర్తి తన భార్య పెట్టెలోనుండి బిస్కట్లు దొంగిలించి తినక పోయినట్లైతే— ఆయన ఇచ్చిన తీర్పును నేను తు. చ. తప్పకుండా శిరసావహిస్తాను."

ఇక శాస్త్రిలవారు ఏం జవాబు చెబుతారు? నోటికి తాళం పడిపోయింది. నరికినా ముఖంపై నెత్తురుచుక్క లేదు. మిగిలినవి రెండేమార్గాలు. శాస్త్రిలవారికి ధైర్యంవుంటే కట్టతో ఆ పిల్లిని చావమోది తరిమివేయడం. లేక పిల్లిలో శక్తివుంటే బలవంతంగానైనా ఆ మిఠాయి ఉండను ఎత్తుకొనిపోవడం. ఈ రెండు పద్ధతుల్లో ఏదోవిధంగా వ్యవహారం పరిష్కారం అయిపోతుంది. కాని సమస్యా పరిష్కారం కాజాలదు.

## పేదల యాజమాన్యం-అందుకు కొన్ని సూత్రాలు:

మేము జగడాన్ని చల్లార్చదలచుకోలేదు, వాయిదా వేయడమూ ఇష్టంలేదు. సమస్యను సంపూర్ణంగా పరిష్కరించ

దలచుకున్నాం. ఏమిటా సమస్య? ఆకలితోనున్న వానికే మిఠాయి లభించితీరాలన్నదే ఆసమస్య. పిల్లి ఆకలితోవుంటే మిఠాయి పిల్లికే దొరకాలి. బ్రాహ్మణుడు ఆకలితోవుంటే బ్రాహ్మణునికే దొరకాలి. ఇదిన్యాయం. కాని, ఈ గుంజులాటలో ఎవరు శక్తివంతులైతే వారికే మిఠాయి లభిస్తూంది. శక్తిగల వారికే అవసరమైన ప్రతి వస్తువూ ఈనాడు లభిస్తూంది. ఎవరి జేబులో పైకం ఉన్నదో వారికే అవసరమైన ప్రతి వస్తువూ లభిస్తూన్నది. ఎవరికి వాస్తవంగా ఆ వస్తువు అవసరంగావున్నదో వారికి దొరకడంలేదు. జబ్బుపడినా మందు కొనేశక్తిలేనివాడు, మందులేకుండానే చనిపోతాడు. అవసరమైన వస్తువు ఈనాడు పైకం జేబులోవున్నవానికే దొరకుతూవున్నది- రేపైనా శరీరంలో శక్తి, చేతిలో కర్రా వున్నవానికే దొరకవచ్చును. ఈరోజు సంచులనిండా ఉన్నవారిదే యాజమాన్యం సమాజంలో- కాని రేపు చేతిలో కఱ్ఱ వున్నవానిదే పెత్తనం కావచ్చును. ఐతే మాత్రం ఇది క్రాంతికాదు. మేము క్రాంతి రావాలని కోరుతున్నాం. ఏ వస్తువు ఎవరికి ఎంత అవసరమున్నదో వారికి ఆ వస్తువు లభించే సర్వావకాశాలూగల సమాజాన్ని మేము నిర్మించదలచుకున్నాం. పేదవాని యాజమాన్యం ఏర్పడే మార్గంలో ఇది మొదటి సూత్రం.

ఉత్పాదక సాధనాలు ఉత్పాదకుల చేతుల్లో వుండడం రెండోసూత్రం. ఆహార పదార్థాలు పండించడానికి అవసరమైన సాధనాలు అవి పండించేవారి చేతుల్లోనే ఉండాలి. వస్తువులను తయారుచేయడానికి అవసరమైన సాధనాలుకూడా ఆ వస్తువులను

తయారుచేయగలవారి చేతుల్లోను, ఉత్పత్తిచేయడానికి ఇష్టపడే వారి చేతుల్లోనూ ఉండాలి. ఇదియే సరియైన సంఘ వ్యవస్థా నిర్మాణం. ఈ విధంగానే రొట్టె తయారుచేయగల స్త్రీలచేతుల్లో అందుకు అవసరమైన పరికరాలూ, చదువ వ్రాయనేర్చిన స్త్రీల చేతుల్లో చదువుటకు, వ్రాయుటకూ అవసరమైన పరికరాలూ ఉండాలి. వంట తయారుచేయగల స్త్రీ కాకితం కలం కోరినా, వ్రాయ చదువనేర్చిన స్త్రీ రొట్టె తయారుచేసే పరికరాలు కావాలన్నా రాజ్యం తలక్రిందులౌతుంది. ఈనాడు సరిగ్గా ఇలానే జరుగుతూవున్నది. భూమిని దున్నలేనివారూ,దున్నుటకు ఇష్టంలేనివారు భూమికి యజమానులుగా నున్నారు. కర్మాగారాల్లోని ఏ ఉత్పాదన కార్యక్రమాల్లోనూ పాల్గొననివాడు ఆ కర్మాగారానికి నేడు యజమాని. చీకటిలో తడుములాడు కుంటూవున్న ఒక నగరం యొక్క అవస్థను పోలిన వ్యవస్థ ఇది. ఎవరివద్ద ఎంత భూమిఉండాలి ? అనేది నేటి సమస్య కానేకాదు. ఇది తరువాత పరిష్కరింపబడవలసిన సమస్య. భూమిని దున్న లేనివారికీ, దున్నడం ఇష్టంలేనివారికీ, ఒక అంగుళమైనా భూమి ఎందుకుండాలి ? ఇదే ప్రధానసమస్య. భూమిని దున్నేవాడు, దున్నగల సమర్థునికీ భూమిపై "స్వాధీనత" ఎందుకు లభించ కూడదు ?

## అంకెలపై ఆధారం ?

చాలామంది ఈ వ్యవహారాలలో పరిశోధన చేస్తూ కేవలం అంకెల గణితపు చిక్కుల్లో ఇరికి పోతున్నారు. ఈ ఉద్యమం

లెక్కలు అమ్ముకునే వారిది కాదు. గుమస్తాలు, కరణాలు క్రాంతిని తీసుకో రాలేరు - వీరంతా అంకెల గణితపు అవధుల్లోనే విపరీతంగా చిక్కుబడి యున్నారు. భూమి పరిమితాలు, మనుష్యుల సంఖ్యలూ వ్రాయడం; వీటిని జోడించడం; భూమిని, మనుష్యుల సంఖ్యతో హెచ్చించడం, మనుష్యుల్లో ఆ భూమిని పంచడం; ఈ విధముగా అస్తమానమూ ఈ పనులతోనే వారి ఆలోచనాశక్తి ఉడిగిపోతూ వున్నది. ఒక జమీందారు కార్యదర్శి కథ ఈ సందర్భంలో గమనించదగినది. ఆయనకు ఈ కార్యదర్శిత్వంలోనే జీవితం గడిచిపోయింది. పిల్లవాని పెళ్లి ముహూర్తం సమీపించింది. ఇది తప్పితే మరికొన్ని ఏళ్లవరకు వేరు ముహూర్తంలేదు. ఎంత కష్టపడినా 20 సంవత్సరాల పిల్ల ఎక్కడా కుదురలేదు. అందుకని, పది సంవత్సరాలుగల ఇద్దరు పిల్లలతో తన కుమారుని వివాహం చేయడానికి నిశ్చయించుకున్నాడు కార్యదర్శిగారు. లెక్కవేశాడు. పిల్లక్రింద పిల్లను తీసివేశాడు. పదితో పదికలిపితే యిరువై ఔతుందికదా! కాని, పది సంవత్సరాలుగల ఒక పిల్లతో, మరో పది సంవత్సరాలుగల ఒక పిల్లను జోడిస్తే 20 సంవత్సరాల పిల్ల తయారౌతుందా? పిల్లక్రింద పిల్ల రద్దౌతుందే కాని గుణకారుడు లెక్కల్లో నుండి మాత్రం బయట పడలేడు. మనుష్యుని క్రింద మనిషి యొక్క వ్యవకలనం మాత్రం జరుగడం సాధ్యం అయితే కావచ్చును.

**విప్లవ సూత్రాలతో అభిమంత్రింపబడిన మట్టి :**

క్రాంతిలో అంకగణితంయొక్క లెక్కలురావు. బీజగణితమే అందుకు వర్తిస్తుంది. అంకగణితంలో అంకెలు, సంఖ్యలు

ఉంటవి. అంకెల తులామానం మరియు విలువలు కొలచి తూచి లెక్కప్రకారం ఉంటవి. బీజగణితంలో సంకేతములు మాత్రమే యుండును. గుర్తులు చిహ్నములుకూడా యుండును. వాటి తూనిక మరియు విలువలకు అంతమనేది ఉండదు. గాంధీజీ ఒక చిటికెడు ఉప్పు పొట్లం తయారుచేసి వేలంవేశాడు. గణిత శాస్త్రజ్ఞులు ఈ లెక్క ప్రకారం సముద్రం ఎన్నిరోజుల్లో ఇంకి పోతుందో అంచనాలు వేయసాగారు. ఉప్పు కొఠారులు ఎన్ని రోజుల్లో నిండిపోగలవో లెక్కవేశారు. వీరు ఒకవైపు లెక్కలు వేస్తూనే ఉన్నారు మరోవైపునుండి ఇంగ్లీషువారి సింహాసనం కదలడం ప్రారంభించింది. క్రాంతి ప్రక్రియల్లో ఇలాంటి "సంకేతాల"మహాత్తును మరిచిపోరాదు. ప్రస్తుతం ప్రోగుచేయబడుతూ వున్న ఒక పిడికెడు మట్టిలో (భూదాన యజ్ఞరూపంలో) అభిమంత్రితమై క్రాంతి ప్రత్యక్షమౌతూ వున్నదనే విషమాన్ని మనం సరిగ్గా తెలుసుకోవాలి.

ఉత్పత్తి చేయనివారి యాజమాన్యాన్ని— ఆధిపత్యాన్ని మేము సమర్ధించజాలం. ఉత్పాదకుల యాజమాన్యాన్ని మాత్రమే స్థాపించ దలచుకున్నాం. ఉత్పాదక సాధనాలు ఉత్పాదకుల చేతుల్లో ఉండడమే-ఉత్పాదకుల యాజమాన్యానికి మౌలికమైన సూత్రం.

## క్రాంతి సమారంభం :

క్రాంతిని మేము భూమినుండి ప్రారంభిస్తున్నాం. ఇందుకు కారణాలు స్పష్టంగా కనబడుతూ వున్నవి. అన్నిటికన్నా ముఖ్య

మైన కారణం ఆకలి. ఆకలి అన్నం దొరికితేనే తీరుతుంది. అన్నం పండించే సాధనం భూమియే. అందుకే భూమిని దున్నే వాని చేతుల్లోనే సాధనా లుండాలని అంటున్నాం. ఎవరు భూమిని దున్నరో వారికి ఒక అంగుళం భూమియైన ఉంచు కోవడానికి అధికారంలేదు. మన దేశంలో 78% మంది భూమి పైననే ఆధారపడి జీవిస్తున్నారు. అందుకే ఈ దేశంలో "క్రాంతి స్వరూపుడు" భూమిని దున్నే రైతు మాత్రమే కాగలడు. ఉత్పాదనకుఆధారభూతమైన మౌలికసాధనాలన్నిటికీ భూమియే పెన్నిధి. బొగ్గు, ఇనుము, నూనె, కట్టు మొదలగు ఉత్పాదన జరిగే వస్తువులన్నీ ఇందులోనుండే పుడుతూ వున్నవి. ఇందుకే మనం క్రాంతిని "భూమి" నుండి ప్రారంభిస్తున్నాం.

ఉత్పాదకుల యాజమాన్యం పర్పడి నప్పుడు ఉత్పత్తి చేయనివారు ఉండరు. దున్నే రైతులకు భూమి ఇస్తే ఉత్పత్తి పడిపోగలదని కొందరు ఆక్షేపిస్తున్నారు. కాని, ఈ వాదనలన్నీ నేడో రేపో నిష్ప్రయోజనకరమైనవని రుజూ కాగలవు. ఈ విధంగా ఆక్షేపించేవారిముందు సమాజంయొక్క సంపూర్ణ స్వరూపం లేకపోవుటయే ఇందుకు కారణం.

## మహారాణి - దాసీ :

ఒక ఇంట్లో అయిదుగురు ఆడవాళ్లుండేవారు. ఒకనాడు వారంతా కలిసి తమ "పార్లమెంటు"సభను జరిపారు. "మేమంతా నేటినుండి రాణులమని" ఆ సభలో తీర్మానం చేసుకున్నారు. ఆదాయవ్యయ పట్టికలుకూడా తయారు చేశారు. అయిదు

వెండి ఉయ్యాలలు చేయించారు. జలతారు దారంతో తయారు చేసిన తాళ్లు దానికి కట్టారు. ఒక్కొక్క మహారాణి ఎంతో హుందాతనంతో ఒక్కొక్క ఉయ్యాలపై కూర్చున్నది. అయితే ఉయ్యాలలు ఎవరు ఊపాలనే సమస్య వచ్చింది. అంతా వ్యవహర్తలే! ఉయ్యాల ఊపడం వారి గొప్పతనానికి తగినపని కాదాయెను! ఏదైనా సమస్యా పరిష్కారంలో బుద్ధి పని చేయజాలనప్పుడు ప్రభుత్వంకాని, అధికారంలో ఉన్న పార్టీకాని ఆ సమస్యను వదిలేయమంటుంది. ఇలాంటి సందర్భాల్లో ప్రభుత్వానికి వ్యతిరేకంగాఉన్న పక్షాలు చాలా ఉదారంతో "పరిస్థితిలో మార్పు వచ్చినప్పుడు ఈ సమస్యా పరిష్కారం" జరుగుతుందిలే అని అంటారు. అనుభవజ్ఞులైన రాజనీతిజ్ఞులవలె మన మహారాణులుకూడా "ఈ సమస్యను"వదలివేయా లనుకున్నారు. గాలివస్తే ఉయ్యాలలు తమంతట తామే ఊగగలవని 12 గంటలదాకా అలానే కూర్చున్నారు. ఆకలి దప్పిక కావడం మొదలైంది. ఈ ప్రశ్న వదిలివేసేదికాదుకదా ? అప్పటికే వారికి తలప్రాణం తోకకు వచ్చింది. చివరకు అంతా కలిసి తమ పార్లమెంటు "పున స్సమాగమం" జరుపుకొని, "ఒకరి కొకరు అన్నం వడ్డించు కోవాలనీ, నీరు ఇవ్వాలనీ మరియు ఉయ్యాల ఊపాలనీ" తీర్మానించు కున్నారు. ఈ సందర్భంలో ఆ యింటి మహారాణులే దాసీలుగా మారడం, దాసీలు రాణులుగా మారడం మనం చూస్తున్నాం. మొత్తానికి అంతా రాణీ సాహెబాలే!

దీనిపేరే వర్గవిహీన సమాజం. కష్టించి పనిచేసేవారే యజమానులు కాగలరు. యజమానులంతా శ్రమచేస్తారు. వర్గ

విహీన సమాజమంటే ఉత్పత్తిదారుల, శ్రమజీవుల సమాజమని తెలుసుకోవాలి.

ఈ ప్రకారం ఉత్పాదకుల యాజమాన్య సిద్ధాంతంలోని మూడు ముఖ్య సూత్రలు మనచేతికి లభించినవి. (1) అవసరమైన వస్తువు అవసరమున్నవారికి లభించాలి. మన ఉద్యమం ఉత్పాదన అవసరాలు తీర్చుకునేటందుకే జరుగాలి. కాని లాభాలను సంపాదించడానికి మాత్రంకాదు. (2) ఉత్పాదక సాధనాలు ఉత్పత్తిచేసే వారిచేతుల్లో ఉండాలి. (3) ఉత్పాదన చేయనివారు సమాజంలో ఉండరాదు. (4) యజమాని కూలీ అనే భేదభావం పోవాలి.

## క్రాంతి అంటే కేవలం దుఃఖనివారణ కాదు:

మన ఉద్యమం కేవలం కష్టాన్ని- దుఃఖాన్ని తొలగించేది మాత్రమేకాదు. ఆకలిగొన్నవారికి అన్నం- గుడ్డలులేనివారికి గుడ్డలూ-ఇళ్లులేనివారికి ఇళ్లూ ఇప్పించడంమాత్రమే మనధ్యేయం కాదు. పేదవారిని ఆధారితులను మాత్రం చేయదలచుకోలేదు. ఉత్పాదక సాధనాలను అతని స్వాధీనంచేసి ఆస్తియొక్క యాజమాన్యం అతనికి లభింపజేయాలని మా అభిప్రాయం. భూమి "ఉపయోగి"వస్తువుకాదు. అది ఒక ఉత్పాదక సాధనం. అందుకే అది దున్నేవానిచేతుల్లోనే ఉండాలి.

అయితే మన ఉద్దేశ్యాలను, లక్ష్యాలను సాధించుకోవడానికి ఏ మార్గాలను అన్వేషించాలి? ఇది క్రాంతియొక్క ప్రక్రియయా? లేక క్రాంతియొక్క మార్గమా? కేవలం పరంపరాగతమైన దాన ధర్మమార్గం కాదు ఇది.

ఇది ఆర్థిక క్రాంతికి పునాదులు వేయుటకు సంకల్పించ బడిన ఉద్యమం. భూదాన యజ్ఞ ఉద్యమం అంటే భూమియొక్క పంపకం జరిపే ఉద్యమమని దీనివల్ల బుజూ అయినది. ఇంతే కాదు. ఉత్పాదక సాధనాలనుకూడా పంచే మహోద్యమం ఇది. ఇంతవరకు ప్రపంచం ముందు మూడు మార్గాలు మాత్రమే యున్నవి-మొదటి రెండూ పరంపరాగతమైన పురాణమార్గాలు; మూడవది క్రాంతిని సాధించే మార్గంలోనే క్రాంతిని తీసుకోరావడం.

## సికిందర్ మార్గం అశాస్త్రీయం - అనుపయుక్తమైనది :

మొదటి మార్గం సాయుధ క్రాంతి మార్గం- బలవంతంగా లాక్కోవడం, దౌర్జన్యం ఉపయోగించి కార్యసాధన చేయడం, ఈ దారిలోనివే. ఒక తువ్వాలకు ఒక చిక్కుముడి పడింది. దాన్ని విడదీయడం ఎవరికి సాధ్యంకావడంలేదు. పెద్దలంతా "సికిందర్ను పిలిపించండి; అతడు భువనవిజయం చేశాడు; ఏదైనా ఉపాయం చెబుతాడు" అని సలహా ఇచ్చారు. సికిందర్ వచ్చి కత్తితో వెంటనే ఆ ముడిని నరికివేశాడు. పాపం! ఇంతకన్న అతడు ఏమీ నేర్వలేదు. మరోవైపు తువ్వాలవాడు ఏడ్వడం మొదలు పెట్టాడు. 'ముడివిడిస్తే తువ్వాల యథాప్రకారం ఉండాలని నేను కోరియుంటినిగాని, ఈ వచ్చిన మహావీరుడు, ముడివిడదీయడానికని, కత్తితో తువ్వాలనే నరికివేశాడే' అని అన్నాడు. సికిందర్ యొక్క ఈ మార్గాన్ని గొప్పగొప్ప రాజకీయ ధురంధురులంతా "క్రాంతి సంవిధాన" మంటారు. ఈ ధురంధురులతో కొంచం మీరు చెప్పండి "మేము మనుష్యుని మనస్సునే మార్చ

దలచుకున్నామని''. కాని, వారో "తలకాస్తా నరికివేయండి. మనస్సూ మార్పుఅనే సమస్యయే ఉత్పన్నం కాదుగదా" అని అంటారు. మనం పేదరికాన్ని ధనికవాదాన్ని నిర్మూలింప దలచుకున్నాం. ఈ రెండూ పోయిన తరువాత ఆ సంపన్నుడూ, ఈ నిరుపేదా ఇద్దరూకలసి సమాన గౌరవంతో బ్రతికే అవకాశాలు కల్పించవలెనని కదా మన అభిప్రాయం. ముడిని నరికివేసే ఆ సికిందరు పద్ధతి మాత్రం "మానవత్వం" యొక్క మూలాన్నే ఛేదించివేస్తూ వున్నది. అది చాల విషమమైన మార్గం. తల్లక్రిందులదారి. కాశ్మీరం పోవాలని మన అభిప్రాయమైతే— ఆ మార్గం మనను కన్యాకుమారం చేరవేస్తుంది. మన కార్యవిధానం ఇదికాదు. ఇది శాస్త్రీయమైనదీకాదు — బుద్ధికుశలతతో ఆలోచించి చెప్పినదీ కాదు.

## ప్రాణంలేని చేతుల రాశి :

రెండోమార్గం— శాసనమార్గం. ప్రజాతంత్ర విధానంలో సంఖ్యాబలంతో నిర్ణయాలు చేసేపద్ధతి ఉన్నంతకాలం శాసనం ద్వారా "క్రాంతి" రాజాలదు. ఒక సిపాయి ఒకసారి రెండువేల చేతులను నరికి సేనాధిపతి ముందు కుప్పపోశాడు. సేనాధిపతి చాలా సంతోషపడ్డాడు. "నీవు చాల వీరసైనికుడ" వని మెచ్చుకున్నాడు. "కాని రెండువేల చేతులకన్నా ఒకవేయి తలలు నరికి తెచ్చినట్లైతే—చాల బాగుండేది. అప్పుడు శత్రువులలో ఎవరెవరు చచ్చిపోయినదీ మనం తెలుసుకో గలిగేవాళ్లం'' అని సిపాయితో అన్నాడు. సిపాయీ ఎంతో వినయ విధేయతలతో

"అయ్యా! నేను తలలే నరికి తెచ్చేవాణ్ని; కాని సాధ్యంకాలేదు. తలలు ఎవరో ఇంతకు పూర్వమే నరికివేశారు. అందుకే నేను చేతులు నరికి తెచ్చాను" అని బదులు చెప్పాడు.

దీనిపేరే "పార్లమెంటరీ విధానం". మానవుని శక్తిసొంతం శవాల చేతులు ప్రోగుచేయడంలోనూ — కుప్పవేయడంలోనూ వినియోగపడింది. ఒకడు తన కుప్పలో 100 చేతులున్నవనీ, రెండవవాడు తన కుప్పలో 75 చేతులున్నవనీ అంటున్నాడు. ఈ పద్ధతిలో నూరు చేతులుగల కుప్పవాడు గెలుస్తాడు. 75 చేతులవాడు ఓడిపోతున్నాడు. ఇందులో చేతుల లెక్కమాత్రమే ఉన్నది. మనస్సుతోగాని, హృదయంతోగాని ఎవరికీ సంబంధం లేదు. దీన్ని మనం "సంఖ్యా ప్రజాస్వామ్యం" అంటాం. దీన్నే "స్వరూపాత్మక ప్రజాతంత్రవిధానం" అనికూడా అంటారు. ఒక మోటరులో 20 అశ్వాల గమనశక్తి ఉన్నదంటే ఆ యిరువై గుర్రాలు మనముందు ప్రత్యక్షం కావడంలేదు. గుఱ్ఱపుశక్తి (Horse Power) లోని గుఱ్ఱం, శక్తియొక్క ఒక అంశం మాత్రమే. శక్తిస్వరూపం కొలతలో కనబడుతూవున్నది. అధికార తృష్ణతోకూడిన రాజకీయాల్లో, అధికారంకొరకు చలాయించ బడే రాజకీయాల్లో మానవుని "మనుష్యశక్తియొక్క" ఒక అంశం కేవలం కొలతబద్ధగా తయారై పోతుంది. సంఖ్యాస్వరూప ప్రజాతంత్ర విధానంలో "మానవ గుణాల"కు స్థానం కేవలం నామ మాత్రం. అందుకే సంఖ్యాత్మక-ఆకారాత్మక ప్రజాస్వామ్య విధానం "క్రాంతికి సాధనం" కాజాలదు. ఈ ప్రజాస్వామ్యం కేవలం ఔపచారికమైనది; నిర్జీవమైనది — శక్తిహీనమైనది. ప్రజా

తంత్రంలో శక్తి ఉత్పన్నం చేయాలంటే గుణాత్మక ప్రజాతంత్ర విధానాన్ని ప్రవేశపెట్టవలసి యున్నది. ఇంతేకాదు- గుణాత్మక ప్రజాస్వామ్యానికి ప్రాణప్రతిష్ఠ చేయవలసి యున్నది. అప్పుడే ప్రజాస్వామ్యంలో వాస్తవికతా—జీవనమూ ప్రవేశిస్తుంది. గుణాత్మక ప్రజాతంత్ర నిర్మాణాన్నికై లోకజీవనంలో "మానవీయ మూల్యములు" విత్తనాలు వెదజల్లవలసి యున్నది. మానవోచితమైన గుణాల బీజారోపణ ఏ శాసనమూ చేయజాలదు.

శాసనము - దాని అవధులు :

శాసనం మనను శాసన విరుద్ధ చర్యలనుండి కాపాడవచ్చును. కాని శాసనహద్దుల్లోనికి రాజాలని దురాచారములను మాత్రం ఆపలేదు. 420 శిక్షణకు విరుద్ధంగా నడిచినట్లైతే న్యాయమూర్తి నన్ను శిక్షించగలడు. కాని, ప్రజలను సర్వ సాధారణంగా మోసంచేస్తువుండే వాణ్ని మాత్రం శాసనం శిక్షించలేదు. శాసనంలో నిర్మాణశక్తి ఉండదు. ఎక్కువలో ఎక్కువ చెడ్డపనులు జరుగకుండా కొంత ఆపగలదు. మంచిపనులు చేయడానికి శాసనం ప్రజలను ప్రేరేపించజాలదు. శాసనం మనిషికి అధికారాన్ని ఇస్తుంది. కాని ఆ యధికారాన్ని సక్రమంగా ఉపయోగించుకునే శక్తినిమాత్రం ఇవ్వజాలదు. శాసనం, మనిషికి కొన్ని అవకాశాలను మాత్రం కల్పించగలుగుతుంది. కాని సమయాన్నిబట్టి లాభపడే సామర్థ్యాన్ని మాత్రం ఇవ్వలేదు. శాసనం గుఱ్ఱానికి నీరు సమకూర్చగలదు. కాని త్రాగించలేదు. కొన్ని ఉదాహరణలు తీసుకుందాం.

మనదేశంయొక్క రాజ్యాంగాన్ని అనుసరించి స్త్రీలందరికి సమానమైన హక్కులేవున్నవి. శ్రీమతి విజయలక్ష్మి పండిత్-రాజకుమారి అమృతకౌరు- సుచేత కృపాలనీ మరియు సరోజిని దేవి- వీరందరికీ అవే హక్కులున్నవి. కాని మనదేశపు స్త్రీలు సర్వసాధారణంగా ఇంటి నాలుగు గోడల మధ్యనుండి బయటికి రారు. ఇంతేకాదు- వీధుల్లో ముసుగువేసుకొని తిరుగుతూ వుంటారు. శాసనం ఈ విషయంలో అధికారం ఇచ్చింది. కాని శక్తి నివ్వజాలకపోయింది. కాగితంపై అస్పృశ్యతా నివారణ ఐపోయింది. కాని నిత్య జీవితంలో అస్పృశ్యత పాటింపబడుతూనే వున్నది. శాసనంప్రకారం మద్యనిషేధం ప్రవేశపెట్టబడింది; కాని ఆచరణలో చూస్తే కల్లూ సారా త్రాగబడుతూనే యున్నవి. ఇంతకూ చెప్పవచ్చిన విషయమేమిటంటే, ప్రజాతంత్రంలో క్రాంతి రావడానికి శాసనంయొక్క అవసరం వున్నది; కాని, ఆ శాసనానికి, సాంఘిక పరిస్థితులు అనుకూలంగా ఉండడమే గాక, స్థానిక నాయకత్వంకూడ లభించాలి.

## ప్రపంచంలోని ప్రజాతంత్ర విధానం:

'శాసనం తన కాళ్లపై తాను ఆధారపడి నిలిచియుండ లేదు. మేము పప్పుచారు, క్షీరాన్నం తింటూవుండే రోజుల్లో శాసన శబ్దాన్ని ఈ రెంటిలో ఏదో ఒకదానితో పోల్చి చెబుతూ వుండడం ప్రజల్లో ఆనాడు పరిపాటిగా ఉండేది. క్షీరాన్నాన్ని కాని, చారునుకాని, నిలువచేయడానికి ఆధారం ఏదో ఒకటి ఉండి తీరాలి. లేనియెడల తొణికిపొయ్యే అవకాశం వున్నది. శాసనం

యొక్క "గతి"కూడ ఇంతే. పెట్టుబడిదారి విధానం చలామణి అయ్యే పరిస్థితుల్లో ప్రజాతంత్రానికి ధనంయొక్క ఆధారం కల్పింపబడుతున్నది. బలవద్విధానం సాగిపొయ్యే సందర్భంలో అది "లాఠీ" వెనుక పరుగెత్తి వెడుతూ వుంటుంది. ప్రాచీన గ్రీకు రోమను ప్రజలు నిర్మించుకున్న ప్రజారాజ్యాల్లో ఈ విష యాన్ని ప్రత్యక్షంగా అనుభవించారు. ప్రజల ఓట్లు కొనివేయ డమూ, లేక భయపెట్టి వేయించుకోవడమూ జరుగుతూవుండేది. ఈనాడుకూడా ప్రజల కోర్కెలు మరియుఅవసరాల ననుసరించి తమ అభ్యర్థులను నిర్ణయించుకొని తమ ఓట్లను వినియోగించు కొనే అవకాశంలేదు. లోభంవల్లగాని, భయంవల్లగాని, ప్రజలు తమ ఓట్లను ఇస్తున్నారు. ఓట్లను దొంగమార్కెట్టులో అమ్మి వేయడం, దోచుకోవడంతో ప్రారంభమయ్యే ప్రజాస్వామ్య ప్రవా హామే విషపూరితమైపోతుంది. ప్రపంచంలోని ప్రజాస్వామ్యా లన్నిటికీ ఇదొక సవాలు?

ఏదో విధంగా గెలుపే ప్రధానంగా భావించే అభ్యర్థి, ఓట్లు ఎలా పంచుకోవడమా అనే పిచ్చిలోనే ఉన్మత్తుడై యుంటాడు. ఓట్లు అడగడానికని పోయి యాచకుడుగా తయారైపోతాడు. ఓట్ల యాచకుడు, ప్రజాభిప్రాయాన్ని నిర్మించలేడు - సూచింపలేడు. ఏ ప్రజాతంత్రంలో ఓట్లు కేవలం "ప్రచారం" పైననే ఆధారపడి సమీకరించబడుతున్నవో ఆ ప్రజాతంత్రములో భావ పరివర్తనం జరుగదు. అందుకే శాసన విధానం ఇందుకు అనుకూలమైనదైనా వ్యాపకశక్తి మాత్రం దానికి లేదని గ్రహించాలి.

శాసన మార్గంలో మరొక దోషంకూడా ఉన్నది. ఇందులో శాసన విధానంపై ఆధారపడిన పెత్తనంకూడా క్రమ క్రమముగా సమాజంలో వ్యాపించిపోతూ వుంటుంది. ఇద్దరు తెలివిగల వకీళ్ళు ఒకే ఇరుగు పొరుగులో ఉండేవారు. ఇద్దరి ఇండ్లమధ్య ఒక మామూలు గోడ వుండెను. ఒకరోజు ఆగోడా కూలిపోయింది. కూలినభాగం గోడ యజమాని ఇంటివేపు కాక పొరుగునగల వకీలు ఇంట్లో పడిపోయింది. గోడ యజ మాని ఏమీ ఖర్చు లేకుండానే తన వస్తువు తన ఇంట్లో వచ్చి పడాలని ఆయన అభిప్రాయం. మూడురోజుల తరువాత పొరు గింటి వకీలుకు ఆయన ఇట్లు నోటీసు ఇచ్చెను: "మూడురోజుల నుండి మా గోడభాగం మీ ఆవరణంలో పడియున్నది. వెంటనే తిరిగి పంపించండి. లేనియెడల దొంగతనపు వ్యవహారం మీపై జరుపబడును." పొరుగింటి వకీలుకూడా ఏమి తెలివితక్కువవాడు కాడు. ఆయన ఈ నోటీసుకు జవాబు ఇచ్చాడు "మూడు రోజులనుండి మీ గోడభాగం మా ఆవరణంలో పడివున్నది — వెంటనే దీనికైన కిరాయి పంపించండి — లేనియెడల దావా వేయ బడును."

## శాసన ప్రతివిప్లవము :

అంతా ఏదో ఒక శాసనం జరగాలనే వాదిస్తూవుంటారు. కాని శాసనం జరిగిన తరువాత దానిని రద్దు చేయించడానికి ఉన్నత న్యాయస్థానాలచుట్టూ తిరుగుతూ వుంటారు. సంవత్స రాల తరబడి వ్యవహారం జరుగుతూవుంటుంది. శాసనం అమలు

లోకి రాకుండా నిలిపివేయబడుతుంది. ఒకప్పుడు "అనధికృత" (invalid) మైనదనికూడా ప్రకటించబడుతుంది. ఈ ప్రకారం ఉన్నత న్యాయస్థానం శాసనం రాజ్యాంగవిరుద్ధమని తీర్పుచెప్పి నప్పటికినీ, ప్రజాప్రతినిధి సభాసభ్యుల (Parliament) చుట్టూ తిరిగి, వారి ఓట్లు సంపాదించి శాసనంలో మార్పుతీసుకో రావ డానికి కాలహరణం జరుగుతూ వుంటుంది. శాసనం ఫలానా సమస్యపై జరగాలని ఎవరు అంటూవుంటారో, వారు తాత్కా లికంగా ఎదురుబడి వచ్చిన సమస్యలను కొంతకాలం వరకు ఏదో విధంగా వాయిదా వేయాలని మాత్రమే, వాస్తవంగా కోరేది. కొంతమందికి, శాసన నిర్మాణరంగంలోనూ "పెత్తనం" చెలా యించాలని వుంటుంది. పారిభాషిక శబ్దాల్లో ఈ పద్ధతిని (Counter Revolution) "ప్రతిక్రియాత్మక విప్లవపంథా"అని అనవలసియుంటుంది. ఈ ప్రతిక్రియావాదాన్ని ఎదుర్కోవడం లోనే సమయమంతా వ్యయమౌతూవుంటుంది. మరొక మౌలిక మైన చిక్కువున్నది. శాసనం ఇరుపక్షాలను రాజీచేయుటకు తోడ్పడేబదులు కక్షలను పెంచడానికే తరుచుగా తోడ్పడుతూ వుంటుంది. శాసనం ఎవరి ప్రయోజనాలకు విరుద్ధంగావుంటుందో వారి మనస్సు బాధపడుతూవుంటుంది. వారు లొంగిపోవడమైన జరిగి తీరాలి- లేదా వ్యతిరేకంగానైనా తయారు కావాలి. ఎవరికి శాసనం అనుకూలంగా వుంటుందో వారికి పట్ట పగ్గా లుండవు. ఉద్దండులై పోతాడు. విశృంఖలులై యధేచ్ఛా వ్యవహారం సాగిస్తారు. భూమిశాసనం, జమీందారీ విధానం రద్దు చేయడంలో ఈ చిత్త వృత్తులను విస్తృతంగా చూడగలిగాము.

పేదరికాన్ని, సంపన్నత్వాన్ని అంతరింపజేయడంలో మా ఉద్దేశ్యం మనిషికీ మనిషికీ మధ్యవుండే దూరాన్ని తీసివేయడమే. కాని, ఉద్దేశ్యం శాసనంద్వారా నెరవేరజాలదు. అందుకే భూదాన యజ్ఞమను 'ప్రక్రియ'ను ఆధారం చేసుకొని మానవుల బుద్ధిలోనూ, చిత్తవృత్తిలోనూ మార్పు తీసుకోరావడానికి మనం ప్రయత్నిస్తున్నాం. కేవలం వస్తుపరివర్తన ద్వారా ఈ మార్పు రాజాలదు.

## వర్గసమన్వయంకాదు - వర్గనిరాకరణ :

మనకు కావలసింది, వర్గ నిరాకరణ గాని, వర్గ సమన్వయంకాదు. వర్గసమన్వయం ఒక తప్పుడు సిద్ధాంతం. చీకటికీ, వెలుతురుకూ సామరస్యము ఏ విధంగా కలుగుతుంది? పేదరికం, ధనికత్వానికీ రాజీ ఎలా సాధ్యమౌతుంది? పేదరికముంటేనే కాని ధనికవాదం నిలువజాలదు. భాగ్యవంతుని సంపద పెరుగుతూన్నకొద్దీ పేదవాని పేదరికంకూడా పెరుగుతూ ఉంటుంది. కనుక వర్గసమన్వయం సంభవంకాదు. వర్గనిరాకరణతో పాటు వ్యక్తుల సమన్వయం మాత్రం సాధ్యం కాగలుగుతుంది. పేదరికాన్ని, ధనికత్వాన్ని నిర్మూలించడానికి ఈ రెండు వర్గాలమధ్య సహకారం వాంఛనీయమే. ఇందువల్ల వర్గనిరాకరణ సాధ్యమౌతుంది — మానవత్వం వికాసాన్ని పొందకలుగుతుంది. వర్గసంఘర్షణ లేకుండా, వర్గనిరాకరణద్వారా పరివర్తనమును సాధించుటకు భూదానయజ్ఞ విధానమే ఏకైక మార్గం. ఇందులో "ప్రతిక్రియా" విప్లవానికి (Counter Revolution) ఏమాత్రం

అవకాశం ఉండదు. సాయుధ క్రాంతిలోనూ, శాసన క్రాంతి లోనూ దీనికి (Counter Revolution) ఎక్కువ అవకాశా లుంటాయి. సాయుధ క్రాంతి జరిగిన దేశాల అనుభవాల దృష్ట్యా మనం ఏమీ గుణపాఠం నేర్చుకోలేమా?

ఈ చారిత్రక, సాంస్కృతిక పరిస్థితులను దృష్టినుంచు కొని పూజ్య వినోబాజీ ఈ దేశంలో క్రాంతియొక్క అమోఘ మైన ఉపాయము నొకదానిని కనిపెట్టినారు — భూదాన యజ్ఞము పేరుతో ఈ ప్రక్రియయొక్క విశేషములు గుర్తింప బడవచ్చును. శబ్దాలు పురాతనమైనవే. కాని వాటి అర్థంమాత్రం క్రాంతిపూరితమైన భావనా పరంపరలచేత పరిపూర్ణమై యున్నది.

## భూమి - ధరిత్రి, వసుంధర, మాత :

చాలామంది భూమి శబ్దార్థం తమకు తెలిసినదే కదా యని భావిస్తారు. కాని వాస్తవం ఇదికాదు. "భూ" శబ్దానికి అర్థం కేవలం "భూమి" కాదు: భూమి కేవలం మట్టిగెడ్డ మాత్రమే కాజాలదు. "భూమి" శబ్దంలో మనుష్యుని అనంత మైన సంస్కృతులు, ఆర్థిక రాజకీయ నైతిక భావనాశక్తులు ఇమిడి యున్నవి - భూగోళం మనుష్యుని నివాసక్షేత్రం. మనుష్యేతర ప్రాణికోటితోనూ, ప్రకృతితోనూ కలసి మెలసి సహజీవన సిద్ధాంతాన్ని ప్రయోగించుటకు ఈ భూమియే తగిన ప్రయోగశాల. ఇంతేకాదు, తనకును, తన తోటివారి కొరకునూ జీవన సామగ్రిని సంపాదించుటకు భూమియే ప్రధాన మైన సాధనము.

ఈ భూమి మన ధరిత్రి. వసుంధర మాతృదేవి. కాని ప్రస్తుత రాజకీయ వాదులు భూమిని తమకు సౌఖ్యము చేకూర్చు పరిచారికగా తయారు చేసుకొని యున్నారు. వారు "భూస్వాములు" "నరపతులు" కావడంతోనే తమ జీవితం సఫలీకృతం అయినట్లు భావిస్తున్నారు. దైవ కృపవల్లనూ, విధాతయగు బ్రహ్మయొక్క నిర్ణయాలవల్లనూ, ఈ నాడు భారతభూమిపై నరపతు లెవరూ లేరు. ఇకముందు "భూపతులు" కూడా ఉండబోరు. ఇప్పటివరకూ రాజులే ప్రజలకు అధిపతులై భూమికీ సంపదకూ యజమానులుగా పరిగణింప బడుతూ వుండేవారు. ఈనాటి మన దేశంయొక్క "సింహాసనం" దరిద్ర నారాయణుని చక్రవర్తి పీఠము. అందుకే ఈ దేశపు ధనం, భూమి ఇకముందు ఏ ఒక్కవ్యక్తి స్వాధీనంలోనూ ఉండబోవడం లేదు – ఈ సంపద అంతటికీ దరిద్ర నారాయణ చక్రవర్తియే సర్వాధికారి.

మన పురాణాల్లో ఒక కథ ఉన్నది — పాపభారమును సహింపలేక భూదేవి ఒకసారి తరుణోపాయమును తెలుపుమని దేవుని పాదములకు నమస్కరించి ప్రార్థిస్తుంది. అప్పుడు భూదేవి గోరూపంలో వెళ్లినట్లు ఆ పురాణాల్లోనే వ్రాసిఉన్నది. దేవుడు "నిన్ను ఎవరు బాధపెడుతున్నారు" అని భూదేవిని అడుగగా "భూదేవి భూమిపతులైన యజమానులవల్ల విసికిపోయాను ప్రభో" అని బదులు చెప్పింది. అందుకు భగవంతుడు "మృత్యులోకంలో అంతా నీ సంతానమే ఉన్నదే. మళ్ళీ యీ యజమానులు ఎక్కడినుండి వచ్చి పడ్డారు" అని అనగా; భూదేవి భయపడి, "స్వామీ! వాస్తవంగా వీరంతా నా పుత్రులే. కాని, వారు

నాకు "పతులు" అనగా భూపతులు కాగోరుతూ వున్నారు. పుత్రు లనిపించుకుంటూనే "యజమానులు" కావడానికి ప్రయత్ని స్తున్నారు. ఎంత అధములై పోయినారో చూడు ప్రభూ!" అని విలపిస్తూ చెప్పుకున్నది.

భూమాత అంతరంగము నుండి బయలుదేరు ప్రతి ధ్వనీ ఆమె మట్టియొక్క ప్రతి అణువులోనుండి వెడలిన ప్రతి రజో కణమూ, భగవంతుని హృదయములోనుండి బయలుదేరిందే. ఈ దేశంయొక్క ఆకాశమూ, వాయుమండలమూ భూమాత యొక్క ఈ మహాదాశయంతోనే ప్రతిధ్వనిస్తూ వున్నవి - ఈ దేశంలో ఇక రాజులూ, మహారాజులూ, ఉండడానికి ఎలా అవ కాశంలేదో, అట్లే యజమానులు కూడా ఉండుటకు ఇక అవకాశం లేదు. ఇది విధాతయైన బ్రహ్మయొక్క శాసనం. ఇందులో ఏమీ మార్పు రావడానికి వీలులేదు.

విధాత వ్రాసిపెట్టినట్లూ- చారిత్రక పరిణామాలవల్లనూ ఎప్పుడో ఒకప్పుడు ఈ వ్యవహారం జరిగితీరవలసిందే, అయిన ప్పుడు "భూదాన యజ్ఞ"మనే సంఘటన అవసరం ఎందుకు ఏర్పడినది? సాధారణ మానవుని నియమ నిష్ఠాపూర్వకమైన పురు షార్థంతో తీసుకోరాబడే విప్లవమందే మానవీయ విలువలకు ప్రాణ ప్రతిష్ఠ చేయగల సమర్థత వుంటుంది. ప్రతీకారాత్మకమైన శక్తి (Negative)లో పురుషార్థము అభావ రూపంలో వుంటుంది. అందులోని ప్రేరణనిషేధాత్మకమైనది. దేశవ్యాపితమైన నియమ నిష్ఠలతో కూడిన పురుషార్థంతో నడుపబడే ఉద్యమం లేకపోతే ప్రజలకోరకై ప్రజలద్వారా ప్రజా విప్లవం రాజాలదు. దానము-

యజ్ఞము అనే ప్రక్రియలు రెండూ, పేదవారికీ, భాగ్యవంతులకూ, తమ నిష్ఠాత్మకమైన పురుషార్థములను ప్రకటించుకొనుటకు సంపూర్ణ అవకాశములను కల్పించుటేకాక వారిని ఆహ్వానిస్తూ వున్నవి. భాగ్యవంతుని దానము పరిగ్రహీతమైనదానికి ప్రాయశ్చిత్తపూర్వకముగా తన సంపత్తిని త్యాగముచేయుటకునూ లాభాలను నిరాకరించుటకొరకూ నిర్ణయింపబడినది. సంపత్తిని కూడబెట్టుట పాపకార్యమే కాదు, దొంగతనము కూడా. యజ్ఞము, దానమూ సంపత్తి రక్షింపబడుటకు చేయబడవు. అవి వ్యక్తిగతంగా పుణ్యాము సంపాదించుకొనుటకో, పరలోకంలో సద్గతిని పొందుటకో ఉద్దేశింపబడలేదు. ఈ దానము సంపత్తియొక్క పరిత్యాగముకొరకు మాత్రం నిర్ణయింపబడినదే కాదు; సంగ్రహణయొక్క సమర్పణమును ప్రోత్సహిస్తూవున్నది- దానము ఒక సన్నివేశముకాదు; అది ఒక పద్ధతి, నిరంతరమైన ఒక ప్రవాహము. వినోబాజీ భూస్వాములను ఆరవ భాగం భూమిని దానంగా ఇవ్వండి అని అడుగుతూవున్నాడు. దీని అర్థం తక్కిన ఐదు భాగాలు వారివద్ద నిల్వవుంచుకొని శ్రావ్య గీతాలు పాడుకొంటూ కూర్చోమనికాదు. "నేడు ఆరవభాగం మరునాడు సగభాగము- ఎల్లుండి ఆరవభాగం మాత్రం వుంచుకొని తక్కినదంతా సంఘానికై త్యాగంచేయవలెను" అని వినోబాజీ చెబుతున్నారు. 1958వరకు, ఎంతభూమిని నీవు సేద్యం చేసుకోగలవో అంతే వుంచుకో- తక్కినదంతా దరిద్ర నారాయణుని చరణములందు సమర్పించివేయుము; భూదాన ఉద్యమం భూమిని పంచడానికే బయలుదేరింది; ఇది భూమిని సంఘమునకేమూ

నికై ఇచ్చుటకై ఒక విధానము. ఈ దానం న్యాయపూర్వకమైన విభజనకే చేయబడుతూవున్నది- భూమిని దానంఇచ్చేవాడు తన పాపాలను తాసే పరిశుభ్రం చేసుకుంటూ వున్నాడు. తీసుకునే వానికి యథార్థరూపంలో సన్మానం జరుగుతూవున్నది- భాగ్యవంతుని దోషాలు పరిహారింపబడుతూవున్నవి. పేదవానికి న్యాయమైన సన్మానం జరుగుతూవున్నది.

సంపదాంతము-మానవత్వానికి రక్షణ :

కాలపురుషుని పాదచిహ్నాలను తెలుసుకోమ్మని వినోబాజీ తరుచుగా అంటూ వుంటారు. తెల్లవారి సామ్రాజ్యం పోయింది: నల్లరాజుల సామంతరాజ్యాలు పోయినవి. మిగిలిన వారి ఆడంబరాలూ, ధనికుల సంపద అంతా ఒకరోజున పోయేదే. కాలంయొక్క గతిని, గమనవేగాన్ని ఆపడానికి ఎవరికీ సాధ్యంకాదు. పరిస్థితులను గుర్తించియే తెల్లవారు స్వయంగా ఢిల్లీ సింహాసనాన్ని వదిలిపెట్టి పోయినారు. అందుకే నేటికీ వారికీ మనకూ మధ్య సాంస్కృతిక సంబంధాలు ఇంకా నిలచియున్నవి. ఎందరో రాజులు సహితం స్వయంగా తమ రాజ్యాలను ప్రజాళక్తి పాదములకు సమర్పించినారు. ఇప్పుడు వారు ప్రజల మధ్యలో నిర్భయులై నిలిచియుండవచ్చును. ధనికులు తమ సంపత్తిని ఇష్టపూర్వకంగా త్యాగంచేస్తే- సంపత్తిమాత్రమే పోయేది. కాని సంఘంలో అతనికి ఎంతో గౌరవం లభిస్తూ వున్నది. ధైర్యంగా నిలబడగలుగుతున్నాడు. ధనికవాదుల సంపత్తిని నిర్మూలించుటే మా లక్ష్యం; కాని అతనిలోని మానవత్వాన్ని నిర్మూలించుట మాత్రంకాదు.

### పెట్టుబడిదారి విధానములోని ఒక మంచి :

ఎవరైనా నన్ను రెండు గుద్దులు గుద్ది నా గడియారమును లాగివేస్తే, నా గడియారము పోవడమేగాకుండా, నా మర్యాదా పురుషార్థమూ- రెండూ మంటగలసి పోతవి. అంతట నేను భయ పడిపోతాను. కసితీర్చుకోవాలనే ఆక్రోశపడుతూవుంటాను. సమ యానికై ఎదురుచూస్తూ వుంటాను. అయితే రష్యాలో విప్లవం జరిగిన 35 ఏండ్లు గడిచిన తరువాతనూ, చైనాలో విప్లవం జరిగిన 5 సంవత్సరాల తరువాతనూ నడుస్తూవున్న నేటి కాలంలో మనము వుంటూవున్నామని తెలుసుకోవాలి. పెట్టు బడిదారీ విధానంలోని అంతర్గతమైన విరోధివర్గాలు తమ ఉచ్ఛ స్థాయిని పొందియున్నవి. త్రిదోషములు ప్రకోపించి సన్ని పాతము పట్టిన వానివలె తన చివరి రోజులు లెక్కపెట్టుకుంటూ వున్నది. ప్రతీకారశక్తిగాని, ప్రతిక్రియాశక్తిగాని ధనవంతులలో మిగిలి లేదు. ఇక వారు పేదవారితో స్నేహసంబంధాలను కలిగి వుండుటలోనే వారి గొప్పతనం యిమిడివున్నది. ఇందులో వారిని భయపెట్టవలసిన అవసరం ఏమీలేదు. మనచుట్టూ కమ్మి యున్న నల్లని కారుమబ్బులను చూపించి రాగల భయమును తెల్పుతూ, మనకు వాస్తవంగా ఎవరు ఆశ్వాశన యిస్తారో వారు మనకు మిత్రులే. వచ్చే ప్రమాదాన్ని ముందుగానే మనకు తెలు పుతూ వున్నారు. దానమివ్వమని చెప్పి వినోబాజీ ధనవంతులు సావధానులై యుండుటకు వీలుగా గోడుగుపడుతున్నారు. అంతేకాని వారిని గాలిలో విడిచిపెట్టడంలేదు.

## సత్యాగ్రహ సిద్ధాంతంలోని ప్రత్యేకత :

దానశబ్దంలో కొంత మందికి శిధిలమైన మతవాదపు వాసన వస్తూవున్నది. సంపదను, భాగ్యవంతులనుండి దానం పొందుటకు "అది వారి అబ్బసొమ్మా" అని ప్రశ్నిస్తున్నారు. వారిని దానమడగడమంటే పరోక్షంగా వారి యాజమాన్యాన్ని అంగీకరిస్తూ వున్నట్లే ఔతున్నదని వీరి అభిప్రాయం. ఈ అభిప్రాయం భ్రాంతి మాత్రమే— నాటోపి ఎవరైనా ఎత్తుకపోతే, అయనతో, నాయనా! ఈ టోపీనాది. నీదికాదు. ఇమ్మని నచ్చచెప్పడానికి ప్రయత్నిస్తే జగడం అవసరమే ఉండదుగదా. భాగ్యవంతుడు కాలపరిస్థితిని గమనించి తన సంపత్తిని సమాజ క్షేమంకొరకు దానం చేసినంత మాత్రాన అతని యాజమాన్యం చిరస్థాయిగా ఉండబోదు. విప్లవతత్వాన్ని గురించి మూఢంగా అలోచించకపోతే ఇలాంటి ఆక్షేపణలేవీ రావు. దానమంటే యదార్థానికి వస్తుమార్పిడికి సరియైనప్రక్రియ. ఇంగ్లీషువారితో మనం ఇండియాను వదలిపొమ్మన్నాం. సత్యాగ్రహ సిద్ధాంతంలో గల అనుశాసనాన్ని దృష్టిలో నుంచుకొని ముందే మనం సూచించేవాళ్లం. గాంధీజీ మోకాళ్లపై రెండుచేతులు జోడించి నమస్కరించి "రాజ్యపరిత్యాగం" చేయమని ఇంగ్లీషు వారిని అభ్యర్థించారు. సత్యాగ్రహ సిద్ధాంతంలోని ప్రత్యేకత ఇదియే. వినోబాజీ ఈ విధానాన్నే అనుసరిస్తున్నారు. తన మానవత్వాన్ని నిజాయితీని రుజూ పరచుకోవడానికి సంపన్నులకిది మంచి అవకాశము.

సత్యాగ్రహ సిద్ధాంతములో అమోఘమైన ఆస్తిక వాదం ఇమిడియున్నది. సత్యాగ్రహి ఎవరినీ దుష్టుడుగా భావించడు. భాగ్యవంతులు, సంపన్నులు దుష్టులుకారు. నిజంగావారు దుష్టులైతే పేదవారు సంపన్నులు కావడానికి ప్రయత్నించరు. తాము చెడ్డవారు కావాలని వారు భావిస్తారా? భాగ్యవంతులు దుష్టులైతే అన్నదానం, వస్త్రదానం చేయడానికీ, వైద్యశాలలు, పాఠశాలలు తెరవడానికీ వారు తమ ధనాన్ని దానం చేయడానికి సంకల్పించరు. అతని హృదయంలో కూడా దయా, సానుభూతి మొదలగు సద్గుణా లుంటాయి. కాని సంపన్నుడు కావడంచేత, అతని పాత్ర విషమమై పోయింది. సంఘానికి శత్రువుగా తయారౌతున్నాడు. అతనిలోని చెడ్డపరిస్థితులు పరిస్థితిని బట్టి ఉత్పన్నమైనవే. తనకు తానై పిశాచ స్వభావం కలిగి యుండడు. వ్యక్తిగతంగా అతడెపుడూ దుష్టుడుకాడు. మూలంలోనే యీ దోషం వున్నది - మనం అతనిలోని యీ దుష్టత్వాన్ని నిర్మూలించి నిజమైన మానవునిగా తయారు చేయదలచుకున్నాం. సంపదను నిరాకరించడంలో సంపన్నుని క్షేమమే ఇమిడియున్నది.

## సంపన్నునిలోని మానవత్వం వికసిస్తున్నది :

మానవత్వంలో సహజంగా అంతర్భూతమై యున్న శక్తి వల్లనూ, కాలక్రమేణా వస్తూయున్న పరిణామాల వల్లనూ, సంపన్నునిలోని మానవత్వం చైతన్యవంతం కాగలదు. ఇంగ్లీషు వారి పరిస్థితిని, దేశీయ సంస్థానాధిపతుల స్థితిగతులను తెలుసు

కున్న తరువాత సంపన్నులలో ఈ మార్పు రావడం వాస్తవానికి విరుద్ధమని ఎవరూ చెప్పలేరు. బీహారులోని జమీందారులు లక్షల ఎకరాల భూమిని దానం ఇచ్చారు. సంపన్నులు కూడా తమ సమయోచిత పరిజ్ఞానమును ప్రదర్శిస్తూ వున్నారు. ఈ సమయజ్ఞత క్రమక్రమంగా వృద్ధినొంది వారి మానవత్వాన్ని సంపూర్ణముగా వికసింప జేయగలదు. కలవారి పురుషార్థం వికసించుటకన్న పేదవారిలోని పురుషార్థం వికాస మొందుటయే భూదాన యజ్ఞంలోని తాత్త్వికరహస్యము. శోషణము, దాన్ని అపహరించుటకు ఇప్పటివరకు ఉపయోగింపబడుతూ వున్న కత్తి బదులుగా చిరునవ్వులు వెలయించే ఇనుప సుత్తెనూ, శ్రమించి పండించి గిడ్డంగులను నింపగల నాగలినీ, భూమిని వ్యవసాయ యోగ్యం చేయడానికి చెట్టూ పుట్టా బాగుచేయు గొడ్డలిని, అన్నవస్త్రములను ఉత్పత్తిచేయగల రాట్నము, గానుగ మొదలగు వాటిని ప్రతిష్ఠింప దలచుకున్నాం. అందుకే మన విప్లవ సాధన యందు రూపాయలమూటలు కాని- కత్తి పెత్తనం కాని ఉండదు కత్తి ఉండదు - శోషణము ఉండదు. కలవారు వేళ్లపై లెక్కపెట్ట తగినంతమంది మాత్రమే ఉన్నారు. అస్త్రశస్త్రములు ధరించే సిపాయీలు కూడ చాల కొద్దిమందే ఉన్నారు. కాని శ్రమించి అన్నవస్త్రాలను ఉత్పత్తి చేసేవారు కోట్లకొలదిగా ఉన్నారు. క్రాంతి సఫలీకృతం కావాలంటే ఈ పేదవారిలో పరస్పర సమైక్యత, ఆత్మీయత తప్పనిసరిగా పెంపొందించవలసిన అవసరం ఎంతో వున్నది. ఈ సమైక్యత ఏర్పాటుకానిది

సంఘ నిర్మాణము, అపజయము నెరుగని సైన్య నిర్మాణము పేదవారిలో సాధ్యం కాదు.

పేదవారిలో పది యకరాల భూమి మేరకు కలిగి యున్నవారు చాల కొద్దిమంది. ఒకటి రెండు యకరాలు గల వారు ఇంకా ఎక్కువగా నున్నారు. అసలే భూమిలేనివారు చాలా అధికంగా ఉన్నారు. వీరందరిని ఒకే ఐక్యతా సూత్రంలో పొదిగించవలసి యున్నది. ఈ ప్రకారం వీరంతా ఏకం కావడానికి, సోదరభావం పెంపొందించు కోవడానికీ భూదాన యజ్ఞ మహోద్యమమే ఒక తార్కాణం. పేదవారు భూదానం చేయడం అంటే వారిలో సమైక్యతా వేదిక నిర్మాణానికి బలిదానం చేస్తున్నారన్నమాట. నిరుపేదల మైత్రికి వారు చేసే భూదానం ఒక చిహ్నం. పేదవారంతా ఒకేకుటుంబానికి చెందిన అన్నదమ్ములనే పరిచయం ఒకరి కొకరు కలిగించుకోవడానికి వారుచేసే భూదానమే ఉజ్వలమైన ఉదాహరణ. పేదవారు తమలో సంఘీభావం ఏర్పాటు చేసుకోవడానికి సాధనాలు ధనముకాదు, ఆయుధాలూ కావు. వారు కార్యసాధనకై చేయగల త్యాగమూ, బలిదానమే వారికి పురుషార్థ సాధనలో ప్రబలమైన శక్తినిస్తవి. పేదవారినుండి దానం సంపాదించి వారిలో సమైక్యతా వ్యవసాయంచేసి వారందరితో కూడిన ఒక గొప్ప సైన్యాన్ని వినోబాజీ నిర్మించ దలచుకున్నారు. లోకంలో నూటికి 95, 97 మందివరకూ పేదవారే. వారంతా వాస్తవంగా ఏకమైననాడు వజ్రాయుధంకంటే ఎక్కువశక్తి సామర్థ్యాలు గలవారౌతారు. అప్పుడు నూటికి ఐదుగురే ఉన్న కల

వారిపై వారు మూడవకన్ను తెరిచే అవసరమే ఉండదు. ఇక ఆయుధాలకు పనికల్పించే అవసరమెందుకు?

## పేదవాడు తన అదృష్టాన్ని తానే నిర్మించుకోగలడు?

పేదవారిచ్చే దానంలో ఒక మౌలికమైన రహస్యం యిమిడియున్నది. పెట్టుబడిదారీ విధానానికి అదే మూలం. యజమాని కావాలనే కోరిక, లాభాలు సంపాదించాలనే తృష్ణ సంపత్తి సంగ్రహణ చేయడానికి ప్రధాన కారణాలు. ఈ ఇచ్ఛయే పేదవారి కాళ్ళకు బేడీలు తగిలించి పెట్టుబడిదారీ విధానం అనే చెరసాలలో బంధించివేస్తూవున్నది. తన సంపద దోచుకోబడగలదని తెలిస్తే కలవారికి గుండెలో దడదడలు ప్రారంభమౌతాయి. పేదవానికి మాత్రం ఆ దడదడలు ఏ మాత్రం ఉండవు. తినడానికే వారివద్ద చాలినంత లేదుకదా? తన బేడీలు ఎవరైనా దొంగిలించుకు పోతారనే భయం ఏ ఖైదీకైనా ఏర్పడినట్లయితే మీరేమంటారు? విస్తారంగా వస్తుసముదాయాన్ని కూడబెట్టడమే సంపన్నత్వం అనిపించుకుంటుంది. స్వల్పంగా నిలువఉంచుకొనడమే పేదరికం. భాగ్యవంతునికి ఇంకా గొప్ప యజమాని కావాలని తృష్ణ కలదు. పేదవానికి తనకున్నదానికంటె కొంచెమైనా ఎక్కువ యాజమాన్యం సంపాదించాలని అభిలాష వుంటుంది. పెట్టుబడిదారీ విధానంలోని ఈ ఇంద్రజాలం పేదవారి నందరినీ సుడిగుండంలో పడవేసి త్రిప్పుతూ వున్నది. అందుకే మనం కలవారిని తమ సంపద వదులుకోమనీ, పేదవారిని తమ పేదరికాన్ని వదులుకోమని అంటున్నాం. పేద

వారంతా తమ సామాన్య యాజమాన్యాన్ని పరిత్యాగం చేయ గలిగిన నాటినుండే తమ అదృష్టసౌధాన్ని తాము నిర్మించుకో గలిగే పరబ్రహ్మమూర్తులౌతారు.

కలవాడు తనకున్న సంపత్తిలోనుండి దానం చేస్తాడు. 20 రొట్టెలుంటే 15 రొట్టెలు ఇతరులకు దానంచేసినా ఇంకా అయిదు రొట్టెలు అతనివద్ద మిగులుతాయి. అందుకే సంపత్తిని విసర్జింపజేయుటకు మనం దానమనే సంకేతాన్ని ప్రయోగించి యున్నాం. లాభమును సంపాదించవలెననే ఆసక్తి ఏర్పడకుండా చేయగల శక్తి దానప్రవృత్తిలోనే యున్నది. కేవలం అయిదు రొట్టెలు తన వద్ద కలిగియున్న నిరుపేద అందునుండి పావు రొట్టెను లేనివానికి నైవేద్యం పెట్టినాడంటే తన గుండెలోని ఒక భాగాన్ని తీసి భగవంతునికి సమర్పిస్తున్నాడన్నమాట. తన స్వశరీరం కోసి త్యాగంచేసి ఈ విధంగా తన సోదరులయందు తనకుగల మైత్రిని ప్రకటిస్తున్నాడు. అతని దానంలో "యజ్ఞా నికి" అవసరమైన అన్ని గుణాలూ వున్నవి. అందుకే పేదవారి "దానాన్ని" మనం యజ్ఞమంటున్నాం. ఈ దానంలో వారిలో అంతర్భూతమైయున్న "యాజమాన్య"తృష్ణయొక్క పరిత్యాగ భావం యిమిడియున్నది. యాజమాన్యమును విస్తరింపజేసి అంద రినీ యజమానులుగా తయారుచేయాలని మన అభిప్రాయం. కాని ఇది మన మధ్యమగమ్యస్థానం. ఇక్కడ మనం ఆగిపోదలచు కోలేదు. ఈ మజిలీ మనకు గొడుగువంటిది మాత్రమే. ఇంటి కప్పువంటిది మాత్రం కాదు. మన గమ్యస్థానం భూమిని గ్రామ

పరం చేయడమే. ఈ ప్రయాణంలో ఉత్పాదనచేసే శ్రామికుల యాజమాన్య స్థాపన మొదటి అడుగు.

## పరస్పరోద్ధరణతో కూడిన ప్రశస్తమార్గం- భూదానం:

కొంతమంది "భూమిని దానంఇచ్చేవారికి మాత్రమే కీర్తి ప్రతిష్ఠలు వస్తాయికాని తీసుకునేవారికి ఏ మర్యాదావుండదు" అని అంటారు. సాయుధక్రాంతిలో మాత్రం తీసుకునేవారికి గౌరవంవుంటుందా? శాసనంద్వారా పొందేవారికి గౌరవం లభిస్తున్నదా? ప్రభుత్వం శాసనంచేస్తే భూమి లేనివారికి భూమి లభిస్తున్నది. ఇందులో లేనివారి పురుషార్థం ఏమున్నది? కత్తి తీసుకొని క్రాంతికారులంతా భూమిపై స్వాధీనత ఏర్పరచుకున్నారు. తరువాతనే దున్నేవారికి పంచియిచ్చారు. ఇందులో భూమిని తీసుకునేవారి పురుషార్థమేమున్నది? అసలు ఈ దృక్పథంతో ఆలోచించడమే తప్పు. ప్రభుత్వం శాసనబలంతో భూమిని స్వాధీనపరచుకుంటే సాయుధక్రాంతికారులు శస్త్రాస్త్రాల బలంతో స్వాధీనపరచుకుంటున్నారు. ఈనాడు "దరిద్రనారాయణుని" ప్రతినిధిగా వినోబాజీ వ్యవహరిస్తున్నాడు. అయితే, లేనివారికి ఇలా ప్రాతినిధ్యంవహించుటలో తాత్వికలోపం ఏమి ఏర్పడుచున్నదో అర్థంకావడంలేదు. క్రాంతి అంటే "ఫలానచోట జరిగిన సాయుధక్రాంతియే" అనే భావనాపరంపర మన మనస్సులలో పరంపరాగతంగా నిలిచియుండడమే ఈ విధంగా ఆలోచించడానికి కారణం. క్రాంతిసాధనములను నిర్ణయించడంలో ఇంతవరకూ ఆలోచిస్తూ వచ్చిన దార్శనికులు గతానుగతికులై

వ్యవహరిస్తూ వచ్చారేకాని కొత్తమార్గాన్ని ఎవరూ త్రొక్కలేదు. పేదవారు సహితం ఈ క్రాంతి యజ్ఞంలో తమ ఆహుతులను సమర్పిస్తూ వున్నప్పుడు ఇక దాతలనీ, దీనులనీ, ఉదారులనీ, బికారులనీ తేడావుండడానికి అవకాశం ఎక్కడుంటుంది? చిన్న రైతు, చేలోపనిచేసే కూలివాడు అంతా సమానమే. వారి సామాజిక స్థాయికూడా ఒకటే. ఈ ఉభయులు ఒకరికొకరు భూమి ఇచ్చిపుచ్చుకున్నట్లైతే యీ "సంప్రదానం" ఇద్దరినీ ఉద్ధరిస్తుంది.

ఏదో అల్లరిచేసి పనిచేసే కార్మికుల పనిముట్లు లాగివేయబడిన ఒక ఉదాహరణ తీసుకుందాం. కట్టెలుకొట్టి జీవించేవాని గొడ్డలి లాగివేయబడింది. రైతు చేతులోని పారకూడా పోయింది. మనం ఈ ప్రకారం తమ వస్తువులను పోగొట్టుకున్న వారినందరినీ ఏకంచేసి వారిలో ఒక సంకల్పశక్తిని కలుగజేయాలి. ఈ సంకల్పం దృఢపడితే సిద్ధిస్తుంది. పోగొట్టుకున్న వస్తువులు వారికి తిరిగివస్తవి. ఇలా ఎవరి వస్తువులు వారికి దొరుకుతే గౌరవం పొందడంలేదా? ఆటలపోటీలలో బాగా ఆడి గెలిచినవానిని సన్మానించి ఏదో ఒక ఆటఆడే సాధనమును ఇనాంగా ఇస్తాము. భవానిమాత శివాజీకి "కత్తి"ని మహాప్రసాదంగా ఇచ్చింది. మనంకూడా వీరులగు సిపాయీలకు కత్తిని కానుకగా ఇస్తాము. అదేప్రకారం ఎవరు కష్టపడి పనిచేసి పదార్థాలను ఉత్పత్తి చేస్తారో వారికి ఆయా ఉత్పత్తులకు అవసరమైన సాధనాలను అప్పగిస్తామనుకోండి! ఇలాచేయడం సాధనాలను పొందినవారికి గౌరవ ప్రదం కాదా?

సంపద కలిగియుండడం పాపమైతే, పేదరికంకూడా పాపమే. సంఘంలో నీచమైన స్థానాన్ని పొందియుండడం ఒక సద్గుణం కాజాలదు. దారిద్ర్యంలో ఏమీ పుణ్యం నిండిలేదు. అది ఒక సామాజికమైన అపరాధమే. నీచస్థితిలో నున్నవాడు సంపన్నుడు కావాలని ఆశిస్తాడు. పోటీలో ఎవడు వెనుకబడి పోతాడో వాడు పేదవాడుగా పరిగణింపబడుతూ వున్నాడు. ఇలాతయారైన పేదవాడు హతాశుడు కావడమేగాక ఆలోచనాశక్తిని కూడా పోగొట్టు కుంటున్నాడు. పేదరికం కారణంగా అతనిలో పశుత్వంకూడా వస్తుంది. మనం సంపన్నునిలోనున్న పైశాచికత్వమునూ, పేదవానిలోని పశుత్వమునూ అంతరింప జేయాలనుకుంటున్నాం. ఇలాచేసి వారిలోనున్న మానవత్వాన్ని పరిరక్షించి వారిని వృద్ధికి తీసుకు రాదలచుకున్నాం. కాబట్టి ఈ విధమైన క్రాంతిప్రక్రియ అపూర్వమైనది; సాటిలేనిది.

## దారిద్ర్యాన్ని - ఆకలిని రెంటినీ పంచుదాం :

భూమిని పంచినట్లైతే ఉత్పత్తి పడిపోగలదని కొంత మంది అభిప్రాయం. పెట్టుబడిదారి విధానంలోని యాజమాన్యం అంటే ఎక్కువ ఉత్పత్తి చేయగలశక్తి అన్నమాట. అంతా యజమానులైతే ఈ శక్తి ఎక్కువౌతుందా తక్కువౌతుందా ? ఈ వర్గం వారన్నట్లు ఉత్పత్తి పడిపోతుందని ఒప్పుకున్నా మనకు విచారం బొత్తిగాలేదు. మనకు కావలసింది ఆర్థికంగా అసమానత్వాన్ని తొలగించడం. సంపద పెరిగినా పెరగక పోయినా ఆకలిని, పేదరికాన్నే మనం పంచిపెట్టవచ్చును. పంచిపెడితే

సంపద ఎలా తరుగుతుందో ఆ ప్రకారమే పేదరికము, ఆకలి సహితం తరుగుతుంది.

ఉత్పత్తి ఎక్కువైనంత మాత్రాన ఆర్థిక విషమత్వం తొలగిపోదు. అవసరమున్న వానికి అవసరమైన వస్తువు లభించవలెను. ఈనాడు ఉత్పత్తి ఎక్కువ చేయడానికై వేయబడే ప్రణాళికల్లో పేదవానికి అవసరమైన వస్తువులు సప్లయిచేసే కార్యక్రమమేమీ ఉండటంలేదు. ఈ ప్రణాళికలు అమలుజరిగే మేరకు ఒకవైపు ఉత్పత్తి అధికమై రాసులు పడుతూవుంటే మరొకవైపు ఆకలితో అలమటించే హాహాకారాలు కూడా ఉత్పన్నమౌతూ వుంటాయి.

ఆకలి ఈశ్వరు డిచ్చిన వరప్రదానము; అదే సమయంలో కాలభైరవుని అభిశాపము. ఆకలికి సంస్కృతి తెలీదు. అది ధర్మాన్ని గుర్తించలేదు. ఒక ప్రత్యేక రాజకీయతంత్రానికి లోంగి ఉండదు. సృష్టికి ప్రతిసృష్టి చేయగల సమర్థుడైన విశ్వామిత్రుడు కరువువచ్చి తనకు ఆకలియైనపుడు ధర్మము, సభ్యతయొక్క హద్దులను అధిగమించి చండాలుని వద్దనున్న పాసిపోయిన కుక్క మాంసమును దొంగిలించి తిన్నాడు. మానవుని వ్యక్తిత్వం ఆకలివల్ల ఎంత నాశనమై పోతుందో, అంతగా అస్త్రశస్త్రాలతో గూడా నాశనంకాదు.

## ప్రతీకారకాంక్ష క్రూరత్వాన్ని పెంచుతుంది :

చైనాలో జరిగిన మహాక్రాంతిలోని ఒక ఘట్టం వినండి. ఒక గ్రామంలో సభ జరిగింది. ఆ సభలో ఒక జమీందారునిపై

ఎన్నో నిందారోపణలు జరిగినవి. వాతావరణమంతా మారి పోయింది. ఒక అమాయకురాలు, దయాశీలి, పిల్లలతల్లియైన ఒకగ్రామ మహిళకూడా ఆ సభలో వుండెను. ఆమె సభలో నిందాస్పదుడై నిలువబెట్టబడియున్న జమీందారును గురించి ఇలా అన్నది. "నేను కోడిని తింటాను. కాని నా చేతులతో కోడిని కోయలేను. నా ముందు ఎవరైనా కోడిని కోస్తూవుంటే నేను చూచి భరించలేను. గుండె దడదడలాడిపోతుంది. కన్నులు మిరుమిట్లుక్రమ్మిపోతాయి, కాని నాలో ఇప్పుడు ఈ జమీం దారుపై ప్రతీకారవృత్తి ఎంతో నిండియున్నది. అమాయకమైన నా యీ చేతులతోనే ఆతని మెడకాయ పిసికి అతని గుండె లోని నెత్తురు త్రాగివేయగలను" ఈ స్త్రీయొక్క స్థానంలో మనదేశపు తల్లులను ఉంచి ఆలోచిస్తే ప్రతీకార భావంతో మనుష్యుని వ్యక్తిత్వం ఏ విధంగా ఛిన్నాభిన్నమై పోతుందో అర్థం చేసుకోగలుగుతాము.

ఈ స్త్రీ రోజూ దైవాన్ని ప్రార్థిస్తూ వుంటుంది. "వచ్చే జన్మలో నన్నో అత్తగాసూ, మా అత్తను నాకు కోడలుగాను పుట్టించు. రోజూ ఆమెను చీపురుతో కొట్టి కక్ష తీర్చుకుంటాను" అని. ఈ విధంగా ప్రతిక్రియాభావోన్మాదం స్వాభావికమైనది. ఇది క్షమించదగినది కూడా. అయినా ఈ స్వభావం ప్రతిక్రియాన్విత మైనదే కదా ! క్రాంతి సఫలీకృతం కావడానికై క్రియాశీలురైన వ్యక్తులు అవసరం. కాని ప్రతిక్రియాస్వభావం కాదు. క్రాంతి మార్గంలో ప్రతిక్రియ (**Reaction**) తప్పనిసరి కాజాలదు. ప్రతి క్రియా స్వభావంలో బయలుదేరిన క్రాంతితోపాటు మొదటి

నుండే ప్రతిక్రాంతికూడా బయలుదేరుతుంది. ఈ క్రియా, ప్రతిక్రియా క్రాంతులకు ఒక అంతమనేది ఉండదు. మనం క్రాంతి ద్వారా మానవుని వ్యక్తిత్వాన్నికూడా పరిరక్షింప దలచుకున్నాం. వ్యక్తిత్వాన్ని ఛిన్నాభిన్నం కాకుండా ప్రయత్నిస్తాం.

## సార్వత్రిక క్రాంతి భూదాన యజ్ఞంద్వారానే సాధ్యం :

సంపన్నులతో మేము ఒక మనవి చేస్తున్నాం. వారు వాస్తవికతను తెలుసుకొనుటలో పెడముఖం పెట్టరాదు. ఈ నాడు పేదవాని రాజ్యం ఏర్పడి యున్నది. అధికారం ఆకలి గొన్నవారి చేతులో వున్నది. యాజమాన్యం వేళ్లపై లెక్క పెట్ట తగిన వారి చేతుల్లో వున్నది. ఈ యాజమాన్యం ఎంత కాలం నిలిచి వుండగలదు? ప్రజాస్వామ్యం; ఆకలి మరియు వ్యక్తిగత యాజమాన్యం అన్నీ కలిసి ఒకే స్థితిలో నిలువజాలవు. ఏదో ఒకరోజు, వాస్తవికమైన శక్తిసమన్వితులైన ఉత్పాదకులు ఉత్పత్తిని చేయనివారి యాజమాన్యాన్ని సమాప్తం చేయకుండా ఉండలేరు. ఈ నియతి అచంచలమైనది. పేదలతో గూడా మేమొక మనవి చేస్తున్నాం. రైతు తినే గింజలు వేరుగానూ, విత్తనాల గింజలు వేరుగాను జాగ్రత్తచేసి ఉంచుకుంటాడు. విత్తనాల ధాన్యం ఎక్కువ విలువకలది; గుణవంతమైనది. పేదవారు సగౌరవంగా ఇచ్చేదానం, మనం ఆశించే క్రాంతికి విత్తనాల రూపంలో ఉపకరించగలదు. పేదవాని పురుషార్థంవల్ల సఫలీకృతమయ్యే క్రాంతి ప్రజలందరి క్రాంతియై వర్థిల్లగలదు. అది సార్వజనీనమైనది, సర్వవ్యాపితమైనది కాగలదు. భూదాన

యజ్ఞం ఈ మహాక్రాంతికి సూచనగా తన పాంచజన్యాన్ని పూరించింది. రానున్న ఆ మహాక్రాంతి మన పురుషార్థాన్ని ఆహ్వానిస్తూ వున్నది. అందుకే వినోబాజీ దానమూ, యజ్ఞము అను రెండు మంత్రాక్షతలను వెదజల్లి ఉభయతారకమైన యీ ప్రక్రియను సాధనంగా తీసుకొని గొప్ప సాహసంతో క్రాంతి క్షేత్రంలో ప్రయోగించి యున్నాడు.

మన కుటుంబ వ్యవస్థ మానవ సమాజంలో సహజీవన సిద్ధాంతంయొక్క పునాదిపై నిర్మింపబడి యున్నది. కుటుంబ జీవితంలోని ఈ సిద్ధాంత మూల్యాలను సామాజిక జీవితంలో ఉపయోగించాలని వినోబాజీ పరిశోధన జరుపుతున్నాడు. అందుకే భూమి, సంపదగల వారితో ఆయన "మీ కుటుంబంలో అయిదుగురు సభ్యులున్నారు. భగవంతుని దయవల్ల మరొక పుత్రుడు పుట్టాడనుకోండి. అతనికి ఆస్తిలో భాగం ఇవ్వరా ?" అని ప్రశ్నిస్తున్నారు. తమ కుటుంబాన్ని ప్రేమించేవారు, 'ఎందుకివ్వమూ?' అని వెంటనే ప్రత్యుత్తరం ఇస్తారు. "పుట్టగానే తన హక్కును వెంబడి తీసుకునే అతడు వస్తాడు" అనికూడా అంటారు. ఆరవ భాగస్తుడు పుట్టినప్పుడు తన హక్కును అడగడానికి మీవద్దకి వస్తాడు. కాని "నేను దరిద్ర నారాయణుని ప్రతినిధిగా మీ ప్రతి కుటుంబంలో మీ భాగస్తునిగా అవతరించి యున్నాను. నాకు నా భాగం యివ్వండి. ఇవ్వరా" అని వినోబా ప్రశ్నిస్తున్నాడు. ఈ ప్రశ్నను విని మన దేశంయొక్క దయాశీలుడైన రైతు నిరుత్తరుడై పోతున్నాడు. తన ఆపదలలో ఆరవ భాగం కూడా అతడు ఇతరులకు దానం ఇస్తున్నాడు.

ఈ ప్రకారం తన ప్రతిభావంతమైన ప్రజాసామాన్యాన్ని ఆకర్షించ గల ప్రత్యేక విధానంద్వారా వినోబాజీ "మానవతత్వంలో" అంతర్భూతమైన విలువలను పరిశోధించి బయటికి తీసి విశాలమైన ఈ క్షేత్రంలో బీజావాపనం చేస్తున్నాడు.

భూమి కంపించి పోతూవున్నది!!

మన యీ యతిరాజుకు, అధికార వ్యామోహంకాని, మమత్వంకాని, యశస్సును సంపాదించవలెనని ఆకాంక్షకాని లేదు. నిరపేక్షమైన నిర్వ్యాజమైన మానవ కుటుంబంతో మైత్రిని కలిగి యుండడమే ఆయన వద్దనున్న సంపత్తి. 1957 చివర వరకు 5 కోట్ల యకరాల భూమి సంపాదించవలెనని ఆయన సంకల్పించాడు. ఒక కోటి భూమిలేని ప్రజలను యజమానులుగా చేయదలచు కున్నాడు. భూమి యీ ప్రకారం ఇతరుల చేతుల్లోకి మారిపోవడంతో సమాజంలో యుగాంతమైన పరిస్థితి వ్యాపించగలదు. ఇది ఆయన ఒక్కని సంకల్పం మాత్రంకాదు. ఈ దేశం యొక్క ప్రజాసామాన్యం యొక్క మహాసంకల్పం. ఇదే భూమాత యొక్క మనోవాంఛ. కాలవాహిని యొక్క గతివిధానం. కాలపురుషుడు యీ సంకల్పంతోనే తన భేరిని ప్రమోగించాడు. క్రాంతిదేవి యొక్క విజయఢంకా యీ సంకల్ప సిద్ధితో ప్రతిధ్వనిస్తూవున్నది. భూమ్యాకాశాలు రెండూ కలసి దశ దిశలా యీ సంకల్ప సిద్ధి కలుగుట సత్యమనే సంకేతాలను ప్రకటిస్తూవున్నవి. ఆదిశేషుని పీఠము కదలిపోతూ వున్నది. భూదేవి తల్లక్రిందులై పోతూవున్నది. మట్టి చైతన్యవంతమై నడువసాగింది.

## క్రాంతి ముహూర్తం నేడే !

సంపన్నులతోనూ, పేదవారితోనూ ఒక మనవి. వారికి నూ నమోవాకములు. తమ తమ శక్తి ననుసరించి భారత మాత పాదములముందు భూమికాని, సంపదకాని నైవేద్యంగా సమర్పించండి. ఎవరివద్ద ఏ పదార్థముంటే ఆ పదార్థాన్నే సమర్పించాలి. ఏమీ లేనివారు కూడా అడవికి పోయి తనకు సంప్రాప్తమైన ఫలములను ఏరి కూర్చి సమర్పించండి. కాని కాల హరణం మాత్రం వృథాగాచేయవద్దు. దానము చేయుటకు ఈ రోజే తగిన సుముహూర్తమని భావించండి. క్రాంతి వర్ధిల్లు టకూ ఇదే శుభముహూర్తం. ఈ రోజు గడిచిపోతే యిలాంటి శుభముహూర్తం మళ్ళీ రాజాలదని తెలుసుకోండి.

భారతమాత మందిరంలో ప్రజలంతా చేతులు జాచి ఆమె కరుణా ప్రసాదమునకై ఎదురుచూస్తూ వున్నారు. కాని ఆమెకు నైవేద్యం పెట్టేవారు మాత్రం ఎవరూ లేరు. నైవేద్యం పెట్టనిది ప్రసాదం మనకు ఎక్కడనుండి రాగలదని వినోబాజీ అడుగు తున్నారు. సంపన్నులు తమ అతులితమైన సంపదను, పేదవారు తమ శక్తికొలది సంపత్తిని భారతమాత పాదములకు నైవే ద్యంగా సమర్పించిననాడు శ్రీ కృష్ణభగవానుడు నవనీతప్రసాద మును ప్రజలకు పంచిపెట్టినట్లు; భారతమాతకూడా తన కరుణా ప్రసాదమును మన కందరికీ పంచిపెట్టగలదు. అప్పుడు మన మంతా చేదోడు వాదోడుగా పనిచేస్తూ కలసిమెలసి భోజనం చేస్తూ జీవితాలను సౌభ్రాత్రంతో సాగించగలం.

*(ఒక బహిరంగసభలో ఇచ్చిన ఉపన్యాసము)*

## :2: పేదల క్రాంతి

ఒక రిక్షాలో అయిదుగురు సవార్లై పోతూవుండిరి. పోలీసు సిపాయీ చూస్తూనే ఉన్నాడు. ఏమన్నా అందామనుకున్నా సాహసంలేక పోయింది. రిక్షాలో కూర్చున్నవారు శ్రీమంతులు ; సూటూ, బూటూ, కండ్లజోడూ మొదలగు ఆధునిక వేషాలతో అలంకరింపబడి యున్నారు. స్టేషన్‌వద్ద రిక్షానుండిదిగి, వారిలో వారు ఏమో మాట్లాడుకోవడం మొదలు పెట్టారు. చర్చలపై చర్చలు జరుగుతూవున్నవి. ఒకే రకమైన సంభాషణ సాధారణంగా అన్నిస్థలాల్లో వినిపిస్తూ వుండడం పరిపాటి. అందులో ఒకడు "ప్రభుత్వం మోసంచేస్తున్నది. ఎక్కడా శాంతిభద్రతలు లేవు. సమయానికి పనికాదు. పేదల విషయం ఏమాత్రం శ్రద్ధ తీసుకోరు. అంతటా వారిని మోసగిస్తూ వున్నారు. అతని ఆత్మ మర్యాద అణగద్రొక్కబడుతూ వున్నది. ఇది పేదల సహృదయాన్ని సంపాదించలేని రాజ్యం. ఈశ్వరుని సంకల్పానికి విరోధి" అని ఏమేమో అన్నాడు.

రెండోవాడు "పెట్టుబడిదారీ విధానం అమలు జరుగుతూ వున్నది—రైతు కూలీలను సంఘటితం చేయనిది నావ దరికి జేరదు" అని, "నేను ప్రస్తుతం అపనే చేస్తున్నాను" అన్నాడు.

## వైజ్ఞానిక ప్రక్రియలో భావనా బలంతో పనిలేదు:

పేదవారియందు ప్రేమగల ఈ మహానుభావులు అయిదుగురు కలిసి ఒకే రిక్షాలో కూర్చున్నారు! కూలివాని నెత్తిన కూడా అయిదుగురి సామాను దయాదాక్షిణ్యాలు లేక ఎత్తారు. ఇంటర్ క్లాసులో కూర్చున్నారు. కూలిపైసలు ఇవ్వడానికి కొంత సేపు కూలివానితో కీచులాడారు. అయితే నిజానికి యీ ప్రజా సేవకులకు పేదలయెడల ఏమైనా నిర్వహింపవలసిన కర్తవ్యం ఉంటేగా? పేదలయందు ఉండవలసిన దయ, సానుభూతి, వారికి జరుగవలసిన ఉపకారం మొదలగు అన్నిటియొక్క బాధ్యత ప్రభుత్వం నెత్తిమీద పడవేశారు. నిజానికి, వారి హృదయాలు మానవీయ భావాలు శూన్యమైన ఎడారులు. వారు విప్లవ వాదులు. దీనులయెడల ఉండదగిన కరుణా వాత్సల్యతలతో వారి కేమీ సంబంధంలేదు. వారికి కేవలం సంఘర్షణ కావలెను. సంఘర్షణలో వారిని అనుసరించేవారే వారికి మిత్రులు. సహచరుడైనవాడు మన "మిత్రుడు" కావలసిన అవసరంలేదు! వానియెడ ప్రేమ ఉండవలసిన పనిలేదు. వైజ్ఞానిక ప్రక్రియలో భావనా వ్యవహారానికి ఏమి సంబంధముంటుంది?

## మనలో సానుభూతిభావం లేదు :

రెండు మూడు రోజుల తరువాత అదే విధమైన దృశ్యం చూచాను. పూర్వం మాదిరే ఒక రిక్షాలో అయిదుగురు కిక్కిరిసి కూర్చున్నారు. ఈ సారి మాత్రం రిక్షావాడు "పెద్ద" మను

ష్యుల బరువును మోయడంలేదు. ఇప్పటి అయిదుగురు మాత్రం పేదరికంచేత కృశించియున్న నిరుపేదలు. వారుకూడా చాలా నిర్దయులై రిక్షావాడితో కూలియిచ్చుటకై పెనగులాడారు. ఇక్కడ పేదరికం వారిని లజ్జావిహీనులను చేసింది. వారి యీచర్య మానవీయమైన ఆవేదనలపై అసిధారావృతంగా పని జేసింది. వారికి తమతోటి పేదవారి కష్టనిష్ఠురములపై సానుభూతి లేకుండెను. కాని ప్రపంచములో "సంపన్నులు" ఎందుకుండాలి? అనేదే వారిని బాధించే ప్రశ్న! రిక్షావాడూ, అందులో కూర్చున్న పేదవారూ, అంతా, సంపన్నుల సంపన్నత్వాన్ని రక్షించడానికై ఏర్పాటు చేయబడియున్న ఆర్థిక విధానాన్ని నిర్మూలించాలని మాత్రం కోరుతున్నారు. ఆ వ్యవస్థకు సంబంధించిన శాసనాలను, నియమాలను నడిబజారులో ఉల్లంఘించాలని వారి అభిప్రాయం. ఇదుగో! "నా ఒక్కరిక్షాపై అయిదుగురు ఎక్కి మీ ముఖాన పేలాలు వేయిస్తున్నారు" అని సంపన్నులను సంబోధిస్తూ రిక్షావాలా ముఖం చిట్లించుకున్నాడు మరొకవైపు. ఈ ప్రకారం సంపన్నులపై రిక్షావాలాకూ, అతని రిక్షాపైకూర్చున్న అయిదుగురు పేదవారికి కూడా అయిష్టత ఉండెను. ఈ ఇద్దరూ సంపన్నులకు బద్ధం శత్రువులు. కాని వారిలో వారికి మాత్రం ఏ విధమైన సానుభూతీ లేదు.

## ఫలితము కోరని సమైక్యత :

పేదవారి ప్రాణాలు వక్రమార్గాన్ని బట్టినవి. సంపన్నుల ప్రాణాలు రెక్కలు కట్టుకొని ఎగిరిపోవాలని ప్రయత్నిస్తూ

వున్నవి. అందుకే ఈ యిద్దరూ పరిస్థితిని అర్థంచేసుకోవడంలో మిక్కిలి అసమర్థులై వున్నారు. ఒకరిపై మరొకరికి ఏర్పడే ప్రతి క్రియా (Reaction) భావంపై ఆధారపడి మాత్రమే వారు తమ వ్యవహారాలను సాగిస్తున్నారు. కాని వీరిలో "ఫలితాన్ని కోరని సమైక్యభావం" ఏ మాత్రం లేదు. అందుకే ప్రతిక్రియా భావంపై ఏర్పడే విరోధం మాత్రమే వీరిద్దరి మధ్య పనిజేయ గలుగుతూ వున్నది. తమలో పరస్పరం మైత్రిని- సఖ్యతను పెం పొందించుకోవాలనే ఆవేదన ఎవరికీ లేదు.

మానవశక్తి రూపంలో పెట్టుబడిదారి విధానం వదిలిపెట్టి యున్న శిధిలావశేషాలు ఇవే. చిత్తవృత్తిలో; కోరికలనుబట్టి పేదవారికీ, సంపన్నులకూ ఏమీ భేదం లేదు. సంపన్నుల మధ్య కూడా ఎక్కువ తక్కువలూ మరియు స్వార్థాల పోటీ ఉండనే వున్నది. పేదవారి మధ్యకూడా ఇలాంటి విరుద్ధ స్వార్థాల పోరాటమే ఉన్నది. ఈ పోటీలు- పోరాటాల మధ్యనుండియే మనం సమానత్వం- సౌభ్రాతృత్వం వైపు పురోగమించ వలసి యున్నది.

## ఇది క్రాంతి కాజాలదు :

క్రాంతి యొక్క ఆవశ్యకత ఎవరికి ఎక్కువగానున్నదని ఆలోచిస్తే, నిరంతరమూ కష్టపడే, దుఃఖ సముద్రంలో ఈదులాడే పేదవానికే ఎక్కువగానున్నదని చెప్పవలసివస్తుంది. 90% సమా జంలో పేదవారున్నారు. ఐనప్పుడు, క్రాంతికై యింత ఆల స్యమూ, వ్యయప్రయాస లెందుకు భరించవలసి వస్తూవున్నది?

అందుకు కారణం పెట్టుబడిదారి విధాన మనస్తత్వాన్ని పేదవారు వదిలి పెట్టక పోవడమే. కొద్దిమంది మాత్రమే ఉన్న సంపన్నులు పేదవారి సహజ పరాక్రమాన్ని పూర్తిగా పనికి రానిదిగా చేసివేయగలుతున్నారు. ఇంతేకాదు, సంపన్నునితో బాటు- పేదవాడుకూడా సంపన్నునివలె మరొకరిని పీడించే అవకాశానికై ఎదురు చూస్తూవుంటాడు. కాని, సంపన్నునికి పీడించడానికి, అవసరమైన సాధనములు, మార్గములు ఎన్ని యున్నవో పేదవానికి అన్నిలేవు. అందుకే ప్రస్తుతం పేదవారు చేసే ఫిర్యాదు ఇదే.అందుకే సంపన్నునికి విరుద్ధంగా సాహసంతో తిరుగుబాటు చేయడం తన హక్కుగా భావిస్తున్నాడు. ఈ తిరుగుబాటులో పాల్గొనమని తోటిపేదలను కూడా ఆహ్వాని స్తున్నాడు. ఈ పిలుపుతో సంపన్నుల సంపదను లాగివేయ డానికి అవసరమైన మనోవృత్తి మాత్రం ఏర్పడుతుంది. కాని ధన సంగ్రహణ విధానాన్ని సర్వే సర్వత్రా నిరాకరించగల భావనాబలం మాత్రం ఏర్పడజాలదు. దీన్ని విద్రోహము- లేక తిరుగుబాటు అంటేఅనండి. కాని ఇది క్రాంతి మాత్రం కాజాలదు.

## దోపిడి విధానంతోకూడిన మనస్తత్వాన్ని పరిత్యజించాలి :

పెట్టుబడిదారి విధానంలోని విలువలను కూకటి వ్రేళ్లతో పెరికివేసి నిరాకరించడమే క్రాంతిశబ్దానికి నిజమైన అర్థం. నూటికి 95 మంది ఏకమై ద్వేషమూ, ప్రతీకార భావంతో నిండిన మూర్తులుగా తయారైననాడు సమాజమంతా విషమయమై

పోగలదు. పేదవారు తమ పేదరికాన్ని నిరాకరించే సాధనా విధానంలో పెట్టుబడిదారి విధానంయొక్క మూల్యాలను ఇక ముందుకూడా పెంచదలచుకో లేదుగదా? కాబట్టి వారు వ్యక్తిగతమైన, కౌటుంబికమైన, సామూహికమైన జీవనవిధానంలో అన్నిటికన్నా ముందు మరొకరిని పీడించే మన స్తత్వాన్ని నిరాకరించవలసి యున్నది. ఒక పేదవాడు, మరొక పేదవాని అవసరాన్ని తనకు లాభదాయకంగా ఉపయోగించుకునే భావం తనలో ఎంతకాలం ఉంచుకొంటాడో— అంతకాలం సమాజంలో పీడించే మన స్తత్వపు విత్తనాలు నిలిచి యుండగలవు. ఇంతే కాదు, పేదవారే ఆ విత్తనాలకు నీరుపోసి పెంచుతున్నారు. కాబట్టి, అవి మొలచి వేరులుపాటి, వృద్ధిపొందగలవనుటలో సంశయం లేదు.

దేశంలోని పేదవారికి ఈ మౌలిక విషయ సత్యాన్ని చక్కగా తెలిసేటట్లు చెప్పవలెను. కౌలుదార్ల తొలగింపులకు వ్యతిరేకంగా సాగింపబడే ఉద్యమాలయందు ఇందుకు చక్కని అవకాశము గలదు.

(భాగల్‌పుర)



అనుబంధము :

# పేదలనుండి భూదాన సేకరణకు 4 కారణాలు

[ వినోబా ]

భూమిగల పేదలనుండి భూమి తీసుకోవడానికి గల కారణాలు నాలుగు; మనం అందరినీ భూమి దానం అడుగుతున్నాం. మధ్యతరగతి రైతులను ఆరవ భాగం యివ్వమని అడుగుతూ వున్నాం. పెద్ద వ్యవసాయదారులను, భూస్వాములను "మీ కొఱకు కొంత ఉంచుకొని తక్కినదంతా మాకు దానం ఇమ్మని అంటున్నాం. మిక్కిలి పేదరైతులనుండి దైవ ప్రసాదంగా తమ కున్న దానిలో ఎంత ఇచ్చినా తీసుకున్నాం. కుచేలుని పిడికెడు అటుకుల నైవేద్యంతో శ్రీకృష్ణ భగవానుడు ఏ విధంగా సంతృప్తిపడి యుండెనో - ఆ విధంగానే పేదలు ఏ కొంచం దానమిచ్చినా భారతమాత ప్రసన్నమౌతుంది. ఈ చిన్నదానం పేదల నిష్కళంకమైన ప్రేమకు ఒక చిహ్నం. దేశంలోని భూమి లేనివారికి భూమి లభించునంతవరకు మనం దానం అడుగుతూనే వుంటాం. పేదలనుండి భూమి ఎందుకు దానం తీసుకుంటారని నన్ను చాలామంది అడుగుతూ వుంటారు. ఈ ప్రశ్నకు సమాధానం ఇవ్వడం అంటే నాకు చాలా సంతోషం. పేదలనుండి భూమి దానం తీసుకోడానికి నాలుగు కారణాలు:-

## 1. పేద తోటిపేదకొరకు త్యాగం చెయ్యాలి :

ఈనాడు సమాజంలో ఎక్కువగా బాధపడుతున్న వారు భూమిలేనివారే. పేదరైతులు వీరికంటే కొంత సుఖ పడుతూనే యున్నారు. ఎవరన్నా దుఃఖమో, సుఖమో పడు తున్నారని మనం అంటే సరిగా పోల్చి చూచియే అంటున్నాం. తనకంటే తక్కువ దశలోనున్న వారినిచూస్తే వారికంటే తామే ఎక్కువ సుఖపడుతున్నారని తెలుసుకుంటారు. అంచేత సమాజంలో అందరికన్న ఎక్కువ బాధపడే వారి కొరకు ప్రతివ్యక్తి కొంత త్యాగం చెయ్యాలి. సముద్రం ప్రపంచంలోని అన్ని వస్తువులకన్న తక్కువస్థాయిలో నున్నది కాబట్టి నీరు ఎక్కడ పడినా సముద్రం వైపే పరుగెత్తి పోతూవుంటుంది. పర్వతాల పైపడిన నీరు కానీ, మైదానంలో పడిన నీరు కానీ, సముద్రం వైపే ప్రవహించి పోతుంది. ఇలా పరుగెత్తే నీరును "నీవు నీకంటె క్రింది దశలోనున్న సముద్రంవైపు ఎందుకు పోతున్నావు" అని మనం ప్రశ్నిస్తే- సముద్రంకంటే నేను ఉన్నతదశయందున్నాను గదా? యని జవాబిస్తుంది. అందుకే సముద్రంవైపు పరుగెత్తి పోతున్నానని సమాధానం చెబుతుంది. కాబట్టి సంపన్నులైన వారు పర్వత, మైదాన ప్రవాహాలవలె పేదవారి కొరకు కొంత దానం చేయడం తమకర్తవ్యంగా భావించాలి. ఈ విధంగానే పేద రైతులుకూడా తమకంటే దుర్దశలోనున్న భూమిలేని పేదవారి కొరకు కొంత దానం చేయడం తమ కర్తవ్యంగా భావించాలి. బొత్తిగాలేని వారికంటే కొంత ఉన్న యీ పేదరైతులు కొంత

సుఖపడుతున్నారు గదా? ఈ పరిస్థితులలో ప్రతివ్యక్తీ ఇతరుల కొరకు ఏదోకొంత దానం చేయడం అతని ధర్మం అవుతుంది. ఈ కర్తవ్యాన్నే మనం తెలియని ప్రజలకు నేర్పదలచు కున్నాం. ఈ రహస్యాన్ని తెలుసుకోక పోయినట్లైతే, తక్కువ భూమిగల వారికి చేయదగిన కార్యక్రమమే కనుపించదు. కాని, సమాజంలోని ప్రతివ్యక్తీ తన కర్తవ్యాన్ని నిర్వర్తించవలసి యున్నది. ఉదాహరణకు నాకు సరిపొయ్యే రొట్టెలే నావద్ద లేవు. ఐనా ఒకడు ఆకలితో నావద్దకి వచ్చినప్పుడు నాకున్న రొట్టెలలో కొంత భాగం అతనికి ఇచ్చివేయడం నా విద్యుక్తధర్మం.

## 2. ఆసక్తిని త్యజించాలి :

చివరకు మనం చెప్పదలుచుకున్న దేమంటే- భూమిపై ఎవరూ యజమానులనేవారు ఉండకూడదు. శ్రీమంతులు ఈనాడు భూమికి తాము యజమానులుగా ఎట్లు భావిస్తున్నారో- అదే ప్రకారం పేదవారుకూడా తమవద్ద నున్న కొద్ది భూమికి తాము యజమానులమని భావిస్తున్నారు. ఈ ప్రకారం యిరువురూ భూమికి తాము యజమానులమని అనుకుంటున్నారు. మనం ఈ యిరువురిని ఆ యాజమాన్యంనుండి విముక్తం చేయదలచుకున్నాం. దప్పికైనవానికి నీరిచ్చి సేవజేయడం మనకు కర్తవ్యం అయినట్లే, భూమి లేనివానికి భూమి ఇవ్వడంకూడా మన కర్తవ్యం. ఏలనన- భూమి దేవునిది. ఈ యదార్థాన్నే మనం ప్రజలకు తెలియజెప్పాలి. యాజమాన్యమనే భావన ఈనాడు ధనికుల్లోనూ పేదవారిలోనూకూడా ప్రబలియున్నది.

అడవిలో కూర్చుండే సన్యాసివద్దకూడా రెండు గోచీ గుడ్డలుంటాయి. వాటికి ఆయన యజమానియే. శ్రీమంతులకు పీతాంబరాలపై వున్న మాదిరే ఆ గోచీగుడ్డలపై సన్యాసికి ఆసక్తి వుంటుందికదా! కాబట్టి మనం ఈ "ఆసక్తి" గలవారి నందరినీ, ఆసక్తినుండి విముక్తం చేయ దలచుకున్నాం.

### 3. నైతికప్రభావం :

మనం ఉన్నవారినుండి భూమి దానం. అడిగినపుడు వారిపై మన ప్రభావం పడేటట్లు వుండాలి. ఈ ప్రభావం ఎలా పడుతుంది ? మనవద్ద అందుకు పనికివచ్చే ఏమి శక్తి వున్నది ? మనవద్ద పిస్తోలున్నదా ? నిజానికి మన వద్ద పిస్తోలూ లేదూ, పిస్తోలుశక్తిపై మనకు విశ్వాసమూ లేదు. పిస్తోలువల్ల ఏమీ కార్యం సాధింపబడదనే మన విశ్వాసం. అందుకే నైతికశక్తిని నిర్మించ దలచుకున్నాం. వేలకొలది పేదవారు దానంచేస్తే మన ఉద్యమానికి నైతికబలం వస్తుంది. దాని ప్రభావం సంపన్నులపై పడుతుంది. వాస్తవంగా మనం ఇలా జరగడంకూడా చూస్తున్నాం. పూర్వం సంపన్నులు దానం ఇవ్వడానికి వెనుకా ముందాడే వారు. కాని హజారీబాగ్‌లో వారు ఎంత భూమి దానం ఇచ్చారో తెలుసునుకదా ? ఇదివరలో యివ్వనివారు ఇప్పుడు ఎందు కిచ్చారు ? పేదవారు రెండు సంవత్సరాలనుండి వరుసగా భూమి దానంచేస్తూ ఉండుట చూసి సంపన్నులు సిగ్గుపడడం ప్రారంభించారు. లజ్జాభిమానాలు కూడా ఒక మర్యాదకు సంబంధించిన విషయమేకదా ! సిగ్గు లేనివారికి సిగ్గురావడం మంచిదే!

"హ్రియాదేయమ్" అని శాస్త్రీలు చెప్పుతూ వున్నవి. నైతిక శక్తిని నిర్మాణం చేయడానికి ఇదొక మార్గం. క్రమంగా సంపన్నులు మన యీ కార్యభారాన్ని తమ భుజస్కంధాలపై వేసుకోగలరని మన విశ్వాసం. ఒక లక్ష యకరాలు భూమి దానం యిచ్చిన ఒక మహారాజు నన్ను కలియడానికి ఒకసారి వచ్చాడు. "మీరు దానం ఇచ్చారు మంచిదే. కాని యింత మాత్రంతో సరిపోదు; మీరు మీ వర్గీయులనుండి భూమి దానం యిప్పించడానికి పనిచేయవలసి వున్నది" అని అన్నాను. ఆయన నా మాటలు విన్నాడు. పనిచేశాడు. ఇదే విధంగా పెద్ద వారంతా మన భారాన్ని స్వీకరిస్తారని నాకు విశ్వాసం వున్నది. పేదవారు చేసిన దానంవల్ల నైతికశక్తి నిర్మాణం ఔతూవున్నది.

## 4. సత్యాగ్రహ సైనికుల శక్తి:

మనం సత్యాగ్రహ సైనికులను తయారుచేస్తున్నామని ఎన్నోసార్లు చెప్పాను. ఉచ్చనీచములనే భేదాలను సంపూర్ణంగా నిర్మూలించుటకు, అందుకు పనికిరాగల సైన్యాన్ని మాత్రమే మనం తయారుచేయాలి. భూమిని, సంపదనూ దానం చేసిన వారు, త్యాగం చేసినవారు మన యీ కార్యంలో సానుభూతిని ప్రదర్శించినవారు మన సైనికులు. కాని మన సైన్యం హింస చేయదు. హింసచేయడానికి ఉపయోగించబడే సైన్యంలో 32 అంగుళాల ఛాతీగల వారినే చేర్చుకుంటారు-కాని మన సైన్యంలో చేరేవారికి మాత్రం త్యాగం అనే విశాలమైన వక్షస్థలం ఉండాలి. అప్పటికీ సంపన్నులు తమ కన్నులు తెఱవక పోయినట్లైతే

మనం మరో అడుగు ముందుకు వేయాలిసి వస్తుంది. మనం ఈనాడు ఏమంటున్నామో, దానికి ఒక అడుగుకూడా ముందు వేయబోమని మనమేమీ సరిహద్దులను ఏర్పాటు చేసుకోలేదు. ఇలాంటి షరతులు, నిర్బంధాలపై మనకు విశ్వాసంలేదు. మనకు ప్రేమించే శక్తి కావాలి. తల్లి తన బిడ్డకోసం ఎంతో త్యాగం చేస్తుంది. పిల్లవానికి సంరక్షణకై కష్టించి పాడిపంటలను పండిస్తుంది. కాని ఆ బిడ్డయే పెరిగి పెద్దవాడై చెడ్డమార్గాన బోతున్నాడని తెలిస్తే దుఃఖిస్తుంది. తన పిల్లవాణ్ని నివారించడానికి చివరకు సత్యాగ్రహం చేస్తుంది. తాను ఉపవాసం చేస్తుంది. అతనికి నచ్చజెప్పుతుంది. ఇతరులను శ్రమపెట్టకుండానే తాను స్వయంగా కష్టపడడం, నచ్చజెప్పడానికి ప్రయత్నించడం, ఇదే సత్యాగ్రహ పద్ధతి.

"సత్యాగ్రహం" పేరు చెప్పి నేను ఎవరినీ భయపెట్ట దలచుకోలేదు. సత్యాగ్రహ సిద్ధాంతం దుర్వినియోగం చేయబడే అవకాశం వున్నదని కూడా నాకు తెలుసు. ఈ రోజుల్లో అలా దుర్వినియోగం తఱచుగా చేయబడుతూనే వున్నది. సత్యాచరణ నియమనిష్ఠా పూర్వకంగా జరుపవలసి యుంటుందని నాకు తెలియును. ఇలా జరిగినప్పుడే ఎదుటివారి హృదయం కరుగుతుంది. ఈ సత్యాచరణకై అవసరమైనంతగా త్యాగం చేయడానికి ప్రయత్నించడమే సత్యాగ్రహం అనిపించుకుంటుంది. ఒక్క నిష్ఠాపరుడైన సత్యాగ్రహి అయినా ప్రపంచంలో ఉంటే ప్రపంచమంతటా అతని ప్రభావం పడుతుంది. సమాజపు

మనస్సు ద్రవిస్తుంది. కాని ఆయన మనస్సులో ప్రపంచం మొత్తాన్ని ప్రేమించే శక్తిమాత్రం వుండవలెను.

## అప్పుడు యుద్ధం అవసరం వుండదు :

మనం ఈ విధంగా తయారుజేసే సైన్యం నైతికంగా ఎంతో శక్తివంతమైనది అవుతుంది. ఈ సైన్యానికి యుద్ధంచేసే అవసరమే రాదు. "హుంకారేణైవ ధనుషః" బాణము వదలవలసిన పనికూడా లేదు. బాణముయొక్క ఢంకారము వినియే ఎదుటివాడు లొంగిపోతాడని చెప్పవచ్చు. ఈ విధంగానే మనం పై సిద్ధాంతాల ప్రకారం తయారుచేసే సైన్యంయొక్క సింహగర్జనతోనే మనం తలపెట్టిన లక్ష్యం పూర్తి కాగలదు. లక్షల కొలది పౌరులు దానంఇస్తే పోరాటం లేకుండానే మన కార్యం నెరవేరగలదు. హజారీబాగు జిల్లాలో మాకు 4½ లక్షల యకరాల భూమి దొరికింది! "ఐనా, ఈ బలిదానంతో నాకు సంతోషం కలగడం" లేదని అన్నాను. అందుకే అక్కడి ప్రజలను 60,000 దాన పత్రాలు సమకూర్చమని కోరియుంటిని. వారు మా యీ అభ్యర్థన అంగీకరించారు. చివరకు మనం చేస్తున్నది ఏమిటనుకుంటున్నారు? శ్రీకృష్ణభగవానుడు గోవర్ధనగిరి యెత్తేటప్పుడు, తమతమ కఱ్ఱలను పర్వతానికి ఎత్తుగా బెట్టమని గొల్లలను ఆజ్ఞాపించాడు. ఇదే జనశక్తి నిర్మించే ఉపాయం. అందుకే మనం అందరినుండి దానం తీసుకుంటున్నాం.